"ప్రపంచంలో వున్న పజిల్స్ సాల్వ్‌చేస్తే చాలు" అన్నాడు నాలోనివాడు.

"ప్రపంచంలోని పజిల్స్ సాల్వ్‌కావు. సోపానార్ ఏం చెప్పాడు? ప్రపంచంలోని సమస్యలు పరిష్కరింపబడవు. ఎందుకంటే సమస్యలు లేకపోతే ప్రపంచమే వుండదు గనక!" అని నేను జవాబు చెప్పాను.

కాని నాలోనివాడు ఇంతటితో వూరుకోలేదు. ఏవేవో ప్రశ్నలు వేస్తూనే వున్నాడు. నేను నాకు చేతనయినట్టు జవాబులు చెప్పకుంటూనే వున్నాను. తనువుమాత్రం కీ ఇచ్చి వదలిన యంత్రంలాగు తనంత తానే ఎక్కడికో వెళ్తూ వుంది.

తనువుకి ఒక బిచ్చగాడు అడ్డుతగిలాడు. "అయ్యా, సామీ!" అన్నాడు. అతడు వృద్ధుడు. పైగా దారిద్ర్యంతో ప్రతి అవయవం కృశించివుంది. వాడినుంచి తప్పించుకోటా నికి వేగంగా నడిచాను. వాడు నా దౌర్బల్యం కనిపెట్టి, "అయ్యా, సామీ!" అంటూ వెంటపడ్డాడు. నేను పరి గెత్తాను.

దారిలో ఎంగిలి విస్తళ్లు ఆప్యాయంగా నాకుతున్న మనుష్యులు—వాళ్ళల్లోనూ దేవుడున్నాడు!—కనిపించారు. పెడబొబ్బలు పెట్టి ఏడుస్తున్న కుంటివాళ్ళూ, గుడ్డివాళ్లూ, కుష్ఠువాళ్లూ—వాళ్ళలోనూ దేవుడున్నాడు!—కనిపించారు. కళ్లు మూసుకొని ఉన్మత్తునివలె పరిగెత్తాను—ఎవ్వరో కిచ కిచ నవ్వారు. ఆంగ్లో యిండియన్ కన్యలై వుంటారు—గది లోకి వచ్చి పడ్డాను.

ఆ రాత్రి మళ్ళీ దేవుడు కనుపించాడు.

"మరో ప్రపంచకం కావాలా ?" అని అడిగాడు.

"అక్కర్లేదు—స్వామీ, అక్కర్లేదు. తమరు కటాక్షించి తమరి దివ్యదర్శనం యిప్పించకుండా వుంటే—అదే చాలు" అన్నాను.

"నీచుడా, ఛండాలుడా, నేను లేకపోతే నీ జన్మ వృథా...పో...పో" అని అరిచాడు దేవుడు.

నేను అదిరిపడి లేచాను భయంతో. "అమ్మా !" అని అరిచాను—చిన్నతనంలోనే అమ్మను పోగొట్టుకున్న అదృష్ట హీనుణ్ణి—"అమ్మా ! అమ్మా !; అమ్మా ! ! !" అంటూ ఆ రాత్రంతా ఏడ్చాను.

## 3

మళ్ళీ తెల్లవారింది—మళ్ళీ దిగులుతో లేచాను—మళ్ళీ దిగులుతో కాలకృత్యాలు తీర్చుకున్నాను. ఈనాడే నేను హైకోర్టు అధికారులచేత 'అడ్వొకేట్' ముద్ర వేయించుకునేది. అసలు హైకోర్టుకి వెళ్దామా వొద్దా అని మథనపడ్డాను.

హృదయేశ్వరి కనిపించింది. ఆమె ఒకసారి అన్నది—"పిల్లలో ."

నాన్నగారు కనిపించారు. ఆయన ఒకసారి అన్నాడు—"మావాడు లేకపోతే నా జన్మవృథా."

స్నేహితులు కనిపించారు. వారు అడిగేవారు-—
"ఎప్పుడు ప్రాక్టీసు పెడతారు ?"

దృఢ సంకల్పంతో లేచి నల్లకోటు వేసుకున్నాను. పెట్టె తెరిచి వెయ్యి రూపాయలు జేబులో పెట్టుకున్నాను. నా గదిలోని నల్లపిల్లి భయం భయంగా నా చుట్టూ తిరిగి, జాలిగా చూచి, "మ్యావ్, మ్యావ్" అన్నది.

"ఛో" అని విదిలించాను.

పాపం వెళ్ళిపోయింది.

నేను ముస్తాబై హైకోర్టుకి బయలుదేరాను. నాలోని వాడు మాట్లాడలేదు. జయించానని గర్వపడ్డాను. హైకోర్టు గేటులో ఠీవిగా అడుగుపెట్టాను.

"బాబూ ! బాబూ !"—ఎవ్వరో పిలిచారు.

దొంగలాగా బెదిరి, వెనుదిరిగి బిత్తరి చూపులు చూశాను.

"బాబూ ! బాలింతరాలిని. అయిదు రోజులనుంచీ దారకం లేదు... చంటిది చచ్చిపోతావుంది ... నా వొళ్ళు అగ్గిలాగా మండిపోతావుంది" అని జ్వరం చూడమన్నట్లు మెడచాచి, చెంప అందించింది.

నేను ఆమెను చూడలేకపోయాను. ఆమె వొంటిమీద ఎక్కడ గుడ్డవుందో, ఎక్కడ లేదో చెప్పలేను. చేతిలోని కసి గందును చూశాను. శరీరం ముచ్చెమటలు పోసింది. బుద్ధునికి బోధి చెట్టుకిందా, మహాత్మునికి బోగం కొంపలో కలిగిన

జ్ఞానం నాకీ బాలింతరాలిముందు కలుగుతుందేమో అని భయం వేసింది.

హైకోర్టువైపు మొహం తిప్పాను. అదీ ఒక వట వృక్షంలాగు కనిపించింది. అ నల్ల గౌన్లతో తిరిగేవారు, ఆ వటవృక్షాన్ని పట్టుకొని వేళ్ళాడే గబ్బిలాయిల్లాగు కని పించారు. మరుక్షణం అదొక ప్రత్యేక ప్రపంచంలాగూ, ఆ నల్ల గౌన్లతో తిరిగే అడ్వొకేట్లుమేఘాల్లాగూ కనిపించారు. దేశానికి ఉపయోగపడే యువకులను ఎంతమందిని తన పొట్టలో పెట్టుకుంటూవుందీ యంత్రం ! !

"ఛీ !" అనుకున్నాను.

ఇంతలో హృదయేశ్వరి జ్ఞాపకం వచ్చింది.

నాన్నగారు జ్ఞాపకం వచ్చారు.

స్నేహితులు జ్ఞాపకం వచ్చారు.

ఒకడుగు ముందుకు వేశాను.

"జాగ్రత్త" అన్నాడు నాలోనివాడు.

"బాబూ" అన్నది బాలింతరాలు.

"క్యార్" మన్నది కసిగందు.

ఆ ధ్వని చూరకత్తికంటే పదునుగా నా హృదయం లోకి దిగింది. నా కళ్ళల్లో నీరు తిరిగింది. నన్ను చూచీ ఆ బాలింతరాలు, "బాబూ, బాబూ ! !" అంటూ తను కూడా కంటతడి పెట్టుకుంది.

అకస్మాత్తుగా జేబులోవున్న వెయ్యి రూపాయిలు నా కళ్ళముందు తాండవించినై. వాటి బరువుతో, ఆశతో మొయ్యలేని బరువును నెత్తిన పెట్టుకున్న కూలిదానిలాగు, కుంగిపోయాను. ధైర్యంగా, వొణుకుతున్న చేతిని జేబులోకి పోనిచ్చాను;

"పిల్లలో!" అన్నది హృదయేశ్వరి.

"నా జన్మ వృధా!" అన్నారు నాన్నగారు.

"ఎప్పుడు? ఎప్పుడు?" అన్నారు స్నేహితులు.

నా చెయ్యి జేబులోకి పోలేదు. అలాగే వేలాడబడి పోయింది.

"జాగ్రత్త" అన్నాడు నాలోనివాడు.

"బాబూ, బాబూ!" అన్నది బాలింతరాలు.

"క్యార్" మన్నది కసికందు.

నాకు ప్రపంచమంతా శూన్యంగా కనిపించింది. ఒక డుగు ముందుకు వేశాను. నాలోనివాడు గిజగిజా తన్ను కున్నాడు. నేను ఒక వూపుతో హైకోర్టులోకి తనువుని జేర వేశాను.

"ఓ!" అని అరిచాడు నాలోని వాడు. నాలో ఏదో పగిలి ముక్కలు ముక్కలైంది. నాలోనివాడు మర ణించాడా?

# మానవ జీవితం

ఒకరోజుపొద్దున్నే దేవుడులేచి మొహంకడుక్కొని జవాన్ని పిలిచాడు. రెండుమూడుసార్లు పిలిచినా, ఎవ్వరూ జవాబివ్వలేదు. అప్పుడు దేవునికి, డబ్బులేక పోవటంవల్ల ఎస్టాబ్లిష్మెంటు తగ్గించినసంగతి జ్ఞాపకంవచ్చి, విచారంగా కూర్చున్నాడు. కొంత సేపయిం తర్వాత ఒక జవాను ప్రవేశించాడు. అతన్ని చూచి దేవుడిలా ప్రశ్నించాడు....

"మర్త్యలోకం మంచేనా ?"

"చిత్తం"

"ఏమిటి సంగతులు !"

"అంతా అనుకూలంగానే ఉందండీ! మానవుడు సగం జీవితం నేర్చుకోవటంతోనూ, మిగిలిన సగం తాను నేర్చుకుంది తప్పని తెలుసుకోవటంతోనూ, గడుపుతున్నాడు......" అన్నాడు జవాను. "మంచిది కనక ఇప్పట్లో మనకేమీ పరవాలేదన్నమాట! ఇంకా కొన్నాళ్లవరకూ మనభుక్తికి లోటులేదన్నమాట...." అని కులికాడు దేవుడు.

– ౦ –

# భాషలో విప్లవం

ఆటలు వ్యాయామం కోసం ఏర్పడ్డవి. కాని నేడు క్రికెట్, టెన్నిస్, బాక్సింగ్ మొదలయిన ఆటలు ఒక కళగా, ఒక వృత్తిగా తయారయినవి. "బ్రాడ్‌మన్ రెండువందల పరుగులు తీశాడు. పెర్రీ వరసగా ఇరవై సెట్లు గెలిచాడు. జోలూయీ, పెప్లింగ్ దవడ బద్దలకొట్టాడు" అని సంతోషి స్తున్నాం. ప్రాణాలను నిలబెట్టటానికి భోజనం ఏర్పరచ బడింది. ఎక్కువ తిని ప్రాణాలమీదికి తెచ్చుకుంటున్నాం. భాషకూడా ఈ గతే పట్టింది. అది ఎందుకు పుట్టిందో, దాని ప్రయోజనం ఏమిటో మరచిపోయి, దానికి మెరుగులు వెయ్యటం, నగిషీలు చెక్కటం, రంగులు పుయ్యటం జరుగు తోంది. దీనివల్ల భావం మరుగున పడిపోవటం, అనుకున్న భావం అనుకున్నట్లుగా వ్యక్తం కాకపోవటం జరుగుతోంది.

భాష ఈ స్థితికి ఎందుకు వస్తుంది? సంఘంలో చలనం లేక నూతన భావాలు పుట్టనప్పుడు భాషకు వాపు ఏర్పడు తుంది. చెప్పిందే చెప్పవలసి రావటంవల్ల రచయితలు భాషకు సాము గరిడీలు నేర్పి తమ ప్రతాపం చూపుతారు. భాషచేత సర్కస్ చేయించి ప్రేక్షకులను ఆకర్షించి కరతాళ ధ్వనులకోసం ప్రయత్నిస్తారు. మన భాషలోని, "రాజనందన రాజ రాజాత్మజులు సాటి" మొదలయిన పద్యాలూ, ఏకా క్షరులూ, ద్వ్యక్షరులూ, త్ర్యక్షరులూ ఈవిధంగానే బయలు దేరాయి... ఈ కారణంవల్లనే ఒకరు నిర్వచనోత్తర రామా

యణం రాస్తే, ఒకరు ఉత్తరరామాయణం రాస్తారు. ఒకరు రామాయణం రాస్తే ఒకరు అచ్చతెనుగు రామాయణం రాస్తారు. ఒకరు నృసింహపురాణం రాస్తే, ఒకరు నారసింహ పురాణం రాస్తారు. ఒకరు రాఘవుని చరిత్రా, పాండవుని చరిత్రా వేరువేరుగా రాస్తే, ఒకరు రాఘవ పాండవీయం రాస్తారు. ఈ అవస్థ భావదారిద్ర్యంవల్ల ఏర్పడుతుంది.

"ఏమిటీ హంగామా ?" అని ఎవ్వరయినా ప్రశ్నిస్తే, "ఇది గ్రంథార్హమైన భాష" అనో, "షెల్లీ, పండిత ప్రకాండులకే వ్రాస్తానన్నాడోయ్" అనో, "కళోపాసకునికి వీలైనంత చేరువై, అతని భాషనూ, సాంకేతికాల్నీ అంగీకరించి, అతని సృష్టిలోని రసాన్ని ఆస్వాదించాలి" అనో చెప్పి రచయితలు తప్పించుకోవలసి వస్తుంది.

ఈ వెర్రితలలను సమర్థించుకోటానికి వీరు ఇంకొక పని చేస్తారు. "కళకోసమే కళ" అనే వాదాన్ని లేవదీస్తారు. కళ ఎందుకు పుట్టింది ? కళకోసమే పుట్టింది. టెన్నిస్ ఎందుకు ఆడుతున్నారు ? ఆడటం కోసమే ఆడుతున్నారు. లూయీ, మెల్లింగ్ దవడ ఎందుకు బద్దలగొట్టాడు ? బద్దలగొట్టటం కోసమే బద్దలగొట్టాడు, అనే వాదం లేవదీస్తారు.

కాని ఈ వితండవాదం ఎవ్వరికి నచ్చుతుంది ? ఎరువు కాళ్ళమీద ఎన్నాళ్లు నిలబడుతుంది ? ప్రజాసామాన్యం, "భాష మానవులు ఒకరి భావాలు ఒకరు తెలుసుకోటానికి ఉపయోగించే ఒక సాధనంగదా ! ఇప్పుడు మీరు చేస్తున్న పనేమిటి ?" అని ప్రశ్నిస్తుంది.

ఈ ప్రశ్నకు సమాధానంగా రచయితలు మాటి మాటికీ "ప్రజాసామాన్యం, ప్రజాసామాన్యం" అంటు

న్నాను. "ప్రజాసామాన్యం" అంటే ఎవ్వరు? అని తిరుగ ప్రశ్న వేస్తారు. కనుక ప్రజాసామాన్యం ఎవ్వరో చెప్పాలి.

ప్రథమంలో అగ్రజాతి ఒక్కటే చదువుకుంది. అప్పుడు రచయితలు ఆ జాతికి నచ్చే భావాలు దాన్ని ఆకర్షించే భాషలో—వైదిక వాఙ్మయం—వ్రాశారు. రాజులు "రసికులైన" తరువాత వారి రుచులకు అనుగుణంగా వారికి నచ్చే భాషలో-ప్రబంధాలు-వ్రాశారు. తరువాత బూర్జువా వర్గంలో చదువు వృద్ధిచెందింది. అప్పుడు వారికి అర్థమయ్యే భాషలో వారికి ఆనందాన్నిచ్చే భావాలతో బూర్జువా కవిత్వం—భావకవిత్వం—వ్యావహారిక వాదం బయలుదేరినయ్. ఇప్పుడు శ్రామికవర్గంలో చదువు వ్యాపిస్తోంది గనక వారికి అర్థమయ్యే భాషలో, వారి సమస్యలను పరిష్కరించే భావాలతో, వాఙ్మయం నడవాలి.

కాని ఈ పరిణామాన్ని గ్రహించగలిగిన సైంటిఫిక్ దృష్టి వున్నవాడు మాత్రం ఇంతటితో వూరుకోడు.

చదువుకున్న వాళ్ళల్లో ఎక్కువమందికి అర్థమయ్యేటట్టు, నచ్చేటట్టు రాయటానికి ప్రయత్నించేమాట నిజమే! కాని ప్రత్యేకంగా ఆ వర్గానికే నచ్చే భావాలను వెలిబుచ్చుతూ కూర్చోడు.

అంటే బూర్జువా నాగరికత ప్రచారంలో వున్న రోజుల్లో ఈ కవి ఆ భావాలనే ప్రచారం చెయ్యక, తరువాత వచ్చే వర్గానికి లాభాన్ని కూర్చే భావాలను, చదువున్న వర్గానికి నచ్చేభాషలో ప్రచారం చేస్తాడు. అంటే తరువాతి వర్గంలో చైతన్యం కలిగించి విప్లవం లేవదీస్తాడు. తరువాతి

వర్గంలో అప్పటికి ఎక్కువ చదువు లేకపోయినా, చదువు కున్నవాళ్లు ఉపన్యాసాలద్వారానో మరేవిధంగానో చెప్తూవుంటే విని గ్రహించుకునే స్థితిలో వుంటుంది గనక ఈ పని జరుగుతుంది.

"ఇంతవరకు బాగానే వుందిగాని ప్రజాసామాన్యం అంటే ఈ శ్రామిక వర్గం అని ఎలా చెప్పటం ?"

అన్ని వర్గాలకంటే ఈ వర్గం మెజారిటీ వర్గం గనక. ఈ వర్గమే "ప్రజాబాహుళ్యం" అనిపించుకుంటుంది గనక. ప్రపంచంలోని సమస్యలన్నీ క్రమ క్రమేణా ఈ వర్గం సమస్యలుగానే పరిణమిస్తున్నాయి గనక. ఈ వర్గానికి అర్థమయ్యే భాష అన్ని వర్గాలకు అర్థమవుతుంది గనక.

"మరి ఈ వర్గాన్ని మనస్సులో పెట్టుకొని, దానికి అర్థమయ్యేటట్లు వ్రాస్తే, అందులో 'కళ' లేదు అంటారే!"

ఈ నిందకు భయపడవలసిన అవసరంలేదు. పురాణాలు మానివేసి ప్రబంధాలు మొదలుపెట్టినప్పుడూ ఇలాగే అన్నారు. ప్రబంధాలు మానివేసి, 'శిష్ట' వ్యవహారం మొదలు పెట్టినప్పుడూ ఇలాగే అన్నారు. ఇప్పుడు వ్యవహారికం మానివేసి గ్రామ్యం రాస్తే ఇలాగే అంటారు. ఎవ్వరి నాగరికతకు భంగం వాటిల్లేటప్పుడు వారు ఏదో ఒక వంకతో గోలపెట్టటం మానవస్వభావం. ఏ వర్గ నాగరికత ఆ వర్గానికి కళగా కనిపిస్తుంది. ఆ నాగరికత పోవలసి వచ్చినప్పుడు "కళ నాశనమౌతోంద"ని గోల పెడుతుంది.

"అయితే కళ అనేదే లేదా ?"

కళ లేక ఏమవుతుంది ? దాని స్వరూపం మారుతుంది. ఇప్పుడు పులమటం కళ అయితే, అప్పుడు సూటిగా చెప్పటం కళ అవుతుంది——ఇప్పుడు mysticism కళయితే అప్పుడు realism కళ అవుతుంది. ఇప్పుడు చెవులకు యింపుగా వుండే అలంకారాలతో రాయటం కళ అయితే, అప్పుడు అర్థమయ్యేటట్లు రాయటం కళ అవుతుంది.

కనుక భాషయొక్క ప్రయోజనం ప్రజాసామాన్యానికి భావాలు అర్థమయ్యేటట్లు——నచ్చేటట్లు——చెప్పటం. ఈ ప్రయత్నం ఫలించటమే కళ. మనం మాట్లాడుకొనేటట్లు రాయలేనిమాటా నిజమే ! మాండలిక భేదాలుండేమాటా (ఈ పరిస్థితుల్లో) నిజమే ! కాని మనం అందరికీ అర్థమయ్యేటట్లు మాత్రం వ్రాయగలం. గనుక భాష "మానవులు ఒకరి భావాలు ఒకరు తెలుసుకోటానికి ఉపయోగించే ఒకసాధనం" అని చెబుతాను.

"అయితే పూర్వం ఎప్పుడో మనుష్యులు భావాలను సంజ్ఞలతో తెలుసుకునేవారట ! ఇప్పుడు కొందరు అభినయం ద్వారా భావ ప్రదర్శనం చేస్తున్నారు. ఇంకా అనేకరీతుల భావప్రదర్శనం జరుగుతోంది. ఇవన్నీ భాషలోకేవస్తాయా?" అనే ప్రశ్న వస్తుంది.

రావు. అందుకనే "ఒక సాధనం" అన్నాను.

నేనీ వ్యాసంలో భావం అంటే ఏమిటో, ఎటువంటి భావం గ్రంథార్హమో చర్చించలేదు. వాఙ్మయం ప్రయో

జనకారిగా ఉండాలన్నప్పుడు ప్రయోజనం అంటే ఏమిటో నిర్వచనం చెయ్యలేదు. భాష, శ్రామికులకు భావాలను అర్థం చేసేదిగా మారటంవల్ల అది ఆ వర్గానికి చెందింది కాకుండా ఏ విధంగా పరిణామం పొందుతుందో వర్ణించ లేదు. భాష ప్రయోజనం ఏమిటో, ఇప్పుడది ఏ విధంగా దుర్వినియోగం చెయ్యబడుతూవుందో, వ్రాశాను.



# కథకి 'క్లయిమాక్స్'

ఇన్ని సంవత్సరాలైన తరువాత నా మొదటి కథను గురించి ఆలోచిస్తే కడుపు చెక్కలయ్యేటట్లుగా నవ్వొస్తుంది. కాని అప్పుడు మాత్రం నరకయాతన అనుభవించాను.

ఆ రోజు యింటికి త్వరగా వెళ్ళాలని ఆఫీసునుంని బయలుదేరాను---బయటకు రాగానే కలవరం కలిగింది. కడుపులో దేవినట్లుగా, దిగులుగా, భారంగా పిచ్చి పిచ్చిగా వుంది. ఈ అవస్థ అర్థంచేసుకోలేక, ఏమీతోచక, ఊరంతా తిరిగాను. కాని ఈ అనుభవం మాత్రం నాకు నూతనం కాదు. అప్పుడప్పుడూ యిలా బాధపడడం, చివరకు ఏదో ఆపత్తు సంభవించటం, నా జీవితానికి మామూలే! ఒకప్పుడు ఆప్తబంధువు మరణించాడు; మరి ఒకప్పుడు ప్రాణస్నేహితుడు వివాహంచేసుకున్నాడు; యింకొకప్పుడు నా కుద్యోగం లభించింది.

ఇవన్నీ ఆలోచించుకునేటప్పటికి, ఈ రో జేంజరుగుతుందో అని భయం వేసింది. వెంటనే చిట్టి జ్ఞాపకంవచ్చింది-గబ గబా యింటికి వెళ్లాను. ఇంట్లో అడుగు పెట్టగానే నా భార్య కనిపించింది. "చిట్టి ఎలాగుంది ? కులాసా..." అని ఆదుర్దాగా అడిగాను.

సీత నన్ను వింతగా ఎగాదిగా చూచి జవాబు చెప్పకుండా వూరుకుంది.

నాకు భయం యెక్కువైంది. "చెప్పు చిట్టి..."అని గుటకలు మింగుతూ అడిగాను.

ఆమె హేళనగా నవ్వి, "ఎందుకీ కంగారూ? యింతలో ఏం జరుగుతుందీ?" అని చర చరా యింట్లోకి వెళ్ళింది.

నేను భారంగా అడుగులు వేసుకుంటూ నాగది ప్రవేశించాను. "ఏమిటీబాధ?? అర్థంకాని, సహించలేని ఈ బాధ——" అని తీవ్రంగా ఆలోచించాను—ఈ ఆలోచనతో తల పగిలిపోతూ వుంది——గంటలు గడిచిపోతున్నాయి——కాని నా బాధ పోనూపోదు——అర్థం కానూకాదు.

ఆ సమయంలో నా భార్య నెమ్మదిగా వచ్చి లాంతరు వెలిగించింది.

నా మాటల ధ్వనికి నాకే ఆశ్చర్యమేసింది. నాభార్య ఒణికిపోయింది. అప్పుడు నా రూప మెలావుందో నే చెప్ప లేనుగాని నా భార్యమాత్రం ఒక భూతాన్ని చూచినట్లు చూచి గదిలోంచి పారిపోయింది.

నేను మళ్ళీ కుర్చీలో కూర్చున్నాను. తల చేతుల్లో యిరికించుకున్నాను. నాలో ఏదో ఒక వింత ఆవేదనపుట్టి బాహిరిల్లటానికి తంటాలు పడుతూన్నట్లుగా అనుమానం కలిగింది——

ఏమిటిది? ఆఁ!...ఆఁ!... తెలిసింది.

మధ్యాహ్నంనుంచీ నాలో జరుగుతూన్న సమరానికి అర్థం నా కిప్పుడు గోచరించింది. తెలిసి బిగ్గరగా నవ్వుకున్నాను. నే నింత చీకాకుపడి బాధపడటానికి కారణం ఏమను

కున్నారు ? నాకొక కథొచ్చింది ! నా హృదయం నాతో కథను రాయించటానికి ఉదయాన్నించీ ప్రయత్నిస్తోంది. ఆ ప్రయత్నాన్ని సరిగ్గా గ్రహించలేక యింత బాధపడ్డాను. చెప్పుకుంటే సిగ్గుచేటు !

వెంటనే కలం తీసుకున్నాను. కాగితాలు తీసుకున్నాను. టేబిల్ ముందుకు లాక్కున్నాను. "కథ రాయాలి! చిన్నకథ రాయాలి ! బుల్లికథ రాయాలి !" అని కృతనిశ్చయంతో కాగితంమీద కలంపెట్టాను—కాని మరో బాధ !

కథ ఎలా వ్రాయాలి ? ఏవిధంగా మొదలుపెట్టాలి ? ఏవిధంగా అంతంచెయ్యాలి ? ఏదో క్లైమాక్స్ అంటారే ? దాన్నేవిధంగా తీసుకురావాలి ?

నే నప్పటికి కథలు వ్రాయకపోయినా, అవి ఎలా వుండాలో, వాటి లక్షణాలేమిటో చాలా గ్రంథాల్లో చదివాను. ఒక గ్రంథకర్త యిలా వ్రాశాడు : "ప్రబంధ కవిత్వానికీ భావకవిత్వానికీ ఎంత తేడావుందో నవలకూ కథకూ అంత తేడావుంది. భేదంకూడా ఒక్కటే ! కథకు ఆవేశం ముఖ్యావసరం" అని వ్రాశాడు.

కనుక దీన్నిబట్టి కథ రాయటానికి కలం కాగితాల కంటే ఆవేశం ముఖ్యమని గ్రహించాను. కాని యీ ఆవేశం ఎలా వస్తుంది ? దీన్ని కథకులు ఎల్లా తెచ్చుకో గల్గుతున్నారు ?

ఈసారి కలం పెదవికి ఆనించి మరీ ఆలోచించాను. ఏమీ తోచక నిరాశగా, కిటికీలోంచి బైటికి చూశాను— బైట పండువెన్నెల ! పూలమొక్కలు, సువాసనలు విర

జిమ్ముతున్నాయి. చల్లగాలి వీస్తూంది — కథకుల రహస్యం నా కప్పుడు బోధపడింది—కథకు కావలసిన ఆవేశం ఎలా వస్తుందో నా కపుడు తెలిసింది. ఆవేశం కలగడానికి తగిన వాతావరణం కావాలి.

"వాతావరణం కావాలి—వాతావరణం కావాలి" అనుకొంటూ కలం చెవులో పెట్టుకొని కాగితాలు చంకలో పెట్టుకొని, కుర్చీ చేత్తో పట్టుకొని తోట్లోకి పరుగెత్తాను.

దారిలో మా నౌకరు నన్నుచూచి, నా అవస్థచూచి, నా అవతారం జూచి నిలువుగుడ్లు వేసి స్తంభించిపోయాడు. 'పాపం! కళాహృదయం వేయించే గంతులు, చేయించే చేష్టలు-యీ అమాయక హృదయానికి ఏ మర్థమౌతాయి?' అనుకుంటూ తోట ప్రవేశించాను.

తీరిగ్గా కుర్చీ వేసుకొని, కాగితాలు ముందుపెట్టుకొని, కలం చేతిలో పట్టుకొని, కళ్ళుమూసుకొని తదేకధ్యానంతో ఆవేశంకోసం ప్రయత్నిస్తూ కూర్చున్నాను- ఆ చల్లగాలిలో ఆ పండువెన్నెల్లో, ఆ ప్రకృతిశోభలో ఆవేశంరాక ఏం జేస్తుంది ?

హఠాత్తుగా, సముద్ర కెరటంలాగా, నీటి జలలాగా, మలేరియా జ్వరంలాగా, ఉబుకుతూ ఉబుకుతూ రానే వచ్చింది— వెంటనే కలం-కాగితం తీసుకొని నా మొదటి కథ వ్రాయటానికి ఉపక్రమించాను :—

అది కటికచీకటి—ఆకాశం మేఘావృతం—ఆ తోట నిర్మానుష్యం-అంతా నిశ్శబ్దం. [ఇక్కడ మూడుచుక్కలు,

మళ్ళీ కథ]—ఆకుల గలగల ధ్వని. మోహనరావు దొంగ లాగా అడుగులో అడుగు వేసుకుంటూ ప్రవేశించాడు — తోటలోని పూలమొక్కలు అతన్ని ఆహ్వానించాయి. వృక్షాలుమాత్రం కదలక మెదలక కన్నీటిబొట్లు రాల్చాయి. [మళ్ళా మూడుచుక్కలు — మళ్ళీ కథ] అప్పటికప్పుడే రాధ అశోకవృక్షం క్రింద మోహనరావుకై నిరీక్షిస్తూ, కూర్చుని వుంది—మోహనరావు గప్‌చిప్‌గా ఆమెను సమీపించి తన కరపల్లవాలతో ఆమె నేత్రపద్మాలను మూసి ఏమన్నాడో చూశారూ?—

"నే నెవరినో చెప్పుకో!" అన్నాడు. ఆమె రివ్వున వెనక్కి తిరిగి చేతులను చాచి, "నాథా! నా హృదయాధి నాథా! వచ్చితివా?" అన్నది. అతడుకూడా వెంటనే చేతులుచాచి "ప్రేయసీ! హృదయేశ్వరీ, వచ్చితిని—వచ్చి తిని" అన్నాడు. ఇద్దరూ కలిసి ఒకపాట పాడారు—తర్వాత కౌగలించుకొన్నారు. [డ్యాష్]

ఇంతవరకూ కలం జరజరా వెళ్ళిపోయింది. కథ ఒక్క బిగువున నడిచింది—కాని ఎంత గింజుకొన్నా ఇక ముందుకు సాగదు — ఏం చెయ్యాలి? కౌగలించుకొన్న నాయికా నాయకులను ఎలా విడదియ్యాలి? ఆలస్యమైతే ఊపిరాడక, ఏమౌతారో?—

ఈ ఆవేశం నా కెందుకు రావాలి? పోనీ! వచ్చింది వచ్చినట్లుగా ఆసాంతం ఉండక మధ్యలో నన్ను విడచిపెట్టి ఎందుకు పోవాలి? అని ఆలోచిస్తూ కూర్చున్నా.

సమయానికి నాకోసం సీత వచ్చింది. నన్ను చూచింది. నా చేతులోని కలం చూచింది — నా వాలకమంతా చూచింది. మూతివిరిచి—"ఈ పనేదో ఇంట్లోనే చేసుకోరాదూ ?" అంది.

సీతను చూడగానే నాకొక వూహా తట్టింది.

"సరేగాని ఇలారా !" అన్నాను.

అయిష్టంగా ఒకడుగు ముందుకు వేసింది.

"నే నొక సలహా అడుగుతాను చెప్పు—"అన్నాను.

ఆమె అవుననూ కాదూ అనకుండా నిలబడింది.

నే నడిగాను :—"ఇదుగో యిటు చూడూ ! ఒక స్త్రీ ఉందనుకో ! ఒక పురుషు డున్నా డనుకో ! వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారనుకో ! ఒక తోటలో కలుసుకున్నారనుకో ! కలుసుకోగానే కౌగలించుకుంటారు గదా ? కౌగిట్లో ఉన్నప్పుడు ఆ స్త్రీ మన స్తత్వం యెలా ఉంటుంది ? ఏం చేస్తుంది ? ఏమంటుంది ?" అని లాలనగా అడిగాను.

మొదట్లో సిగ్గుపడింది. తర్వాత కోపంనటించి "ఎప్పుడూ ఇవేమాటలు ! ఇంతకంటే మనకు వేరే పనే ముందీ ?" అని విదిలించుకుంటూ వెళ్ళిపోయింది.

నాకేమీ తోచలేదు. చంద్రుడు వెన్నెలకాస్తూనే ఉన్నాడు. చల్లగాలి వీస్తూనేవుంది. ప్రకృతి ప్రకాశిస్తూనే వుంది. కాని నాకుమాత్రం ఆవేశం రావటంలేదు. కౌగిట్లో అతుక్కుపోయిన నాయికా నాయకుల్ని ఏంచెయ్యాలో తోచటంలేదు. బలత్కారంగా విడదీస్తేమాత్రం విడిపోయి

ఏంచేస్తారు ? ప్రేమించుకున్నవాళ్ళు 'నా హృదయమా ! నా ఊపిరితిత్తులా !' అనటంకంటే ఇంకేం చెప్తారు ?

కలం విసుగ్గా క్రిందపెట్టాను; తోట్లోకి చూశాను. చంద్రుడు చెట్లసందునుంచి వెక్కిరిస్తున్నాడు. చెవులు గింగురుమనేటట్లుగా గాలి వీస్తూంది. కాగితాలు రెపరెపలాడిపోతున్నాయి.

"నాన్నా !" అనే పిలుపు వినిపించింది.

తిరిగిచూచా ! చిట్టి నెమ్మదిగా దగ్గరకొచ్చింది. ఇది వరకంత చనువుగా దగ్గరకురాక, బెరుగ్గా భయంగా కొంచెం దూరంగా నిలబడి "అమ్మ రమ్మంది" అంది. "రా ! నాన్నా ! తేళ్ళూ పాములూ ఉంటై చీకట్లో" అంది.

"కథ పూర్తిచేసి వస్తానమ్మా" అన్నాను.

ఈ మాటవిని చిట్టి కళ్లు యింతంతచేసి, అమాయికంగా అడిగింది : "అసలు కథరాయటం ఎందుకు నాన్నా ?"

"క్లైమాక్సుకోసం" అనేజవాబు నోటిదాకావచ్చింది. కాని ఆ చంటిదానికి ఈ గొప్పవిషయాలు అర్థంచేసుకోడానికి ఆయిచాలదని వస్తాయించి ఊరుకొన్నాను.

"పోనీ, ఇంట్లోకివచ్చి రాసుకో నాన్నా ?"

"నువ్వెళ్లు చిట్టీ! నా కిక్కడుంటేకాని ఆవేశంరాదు."

"అదేమిటి నాన్నా ! అలా అంటావు ? చలిగాల్లో ఉంటే జలుబు చేస్తుందిగాని ఆవేశమొస్తుందా ?"

నాకామాట వినేటప్పటికి కోప మొచ్చింది ... మళ్ళీ నేనూ నా ఆలోచనా, నా పండువెన్నెలా తయారు! ఈసారి ఎంతసే పాలోచించానో చెప్పలేను. తోటసంగతి మరచి

పోయాను. వెన్నెల మరచిపోయాను. మలయమారుతం మరచి పోయాను. శూన్యహృదయంతో స్మశాన వైరాగ్యంతో కూర్చున్నా.

నేను బాహ్యప్రపంచాన్ని మరచిపోయిన ఈ స్థితిలో దగ్గరగా కేకలూ ఏడ్పులూ బొబ్బలూ వినిపించినై. ఉలిక్కి పడి కంగారుగా తిరిగిచూశాను.

నలుగురు మనుష్యులు—"పాము! త్రాచు! నల్ల త్రాచు! అడ్డంలెండి!" అని కేకలు పెట్టుకుంటూ వస్తు న్నారు.

నా శరీరం వొణికింది; గుండెలు దడదడ కొట్టు కున్నాయి—గొంతులో గురగురమంది—"అమ్మో!" అని అప్రయత్నంగా వెర్రికేక వేసి గభాల్న కుర్చీఎక్కి నిలబడ్డాను. కలం దూరాన పడిపోయింది. కాగితా లెగిరిపోతున్నాయి.

అందుకోటానికి ముందు కొరిగాను. ఇంకేముంది? కుర్చీమీదనుంచి కాలుజారింది. విరుచుకుపడ్డాను.

కథ కంచికి వెళ్ళింది, నేను మంచమెక్కాను.

తర్వాత నాకు తలమీద పెద్దగాయం తగిలిందనీ, జ్వరంలో "నా కథపేరు పాము", "భలే క్లయిమాక్సు పెట్టాను" "ఊపేస్తుంది!" "కాని ఆ నాయికా నాయకుల్ని విడదీసి పుణ్యం కట్టుకోండి!" అని కలవరించాననీ నాభార్య చెప్పి కొంటెగా నవ్వింది.

నాకు మాత్రం నవ్వురాలేదు.

ఇందులోని భావాలు 'నా మొదటి కథ' అనే రేడియో ప్రసంగంలోవి.

# పాండిత్యం

## సుబ్బానధాస్లుగారికి

అయ్యా,

మీ విమర్శ చూశాను. నేను పండితుణ్ణికాదనీ, అందువల్ల నా వ్రాతలకు విలువలేదనీ, మీరువ్రాశారు.

రైట్, బాగానేవుంది.

కాని మీ రే యే పుస్తకాలు చదివారు? తెలుగులో ఇరవైపుస్త కాలూ, సంస్కృతంలో పది పుస్తకాలేగా! అంటే ఆరు నెల్ల చదువన్నమాట!

తెలుగులో మీరు చదివినన్ని పుస్తకాలు నేనూ చదివాను. అయితే మీరేమో మీటింగుల్లో పద్యాలు కోట్ చేసే దృష్టితో చది వారు; నేనేమో భావం గ్రహించాలనే ఉద్దేశంతో చదివాను. ఇక సంస్కృతం అంటారా?

సంస్కృతం నేను చదవనిమాటనిజమే! కాని పరభాషఅయిన సంస్కృతంలో మీరు పదిపుస్తకాలు చదివితే, పరభాష అయిన ఇంగ్లీషులో నేను నాలుగు వందల పుస్తకాలు చదివాను. నాకింకా ఇంగ్లీషులో కొన్నివందల పుస్తకాలు చదివే అవకాశంవుంది. మీకు సంస్కృతంలో ఆ అవకాశంలేదు.

కనక చూడగా చూడగా మీకంటే నే నే పెద్దపండితుణ్ణి....

శలవు.

—రామారావు

—o—

# ఏది ఉత్తమ రచన?

"అబ్బే నీ పుస్తకం బాగాలేదు" అంటారు పాఠకులు.

"నేను రాసింది నీకోసం కాదు" అంటాడు రచయిత.

చదువుకునేవాళ్ళ కోసం కాదు రాసింది అనటం సాహసమే! కాని, తాము కష్టపడి, బుర్ర బద్దలుకొట్టుకొని, రాత్రింబగళ్లు కష్టపడి రాసింది 'బాగాలేదు' అని చప్పరించే టప్పటికి వాళ్లు మండిపోతుంది. రచయిత ప్రజలకు రుచించాలనే రాస్తాడు. పదిమందిచేతా బాగుందనిపించుకొని సంతోషించాలనే రాస్తాడు—పేరు సంపాదించుకోవాలనే రాస్తాడు.

కాని తాను రాసింది బాగాలే దనేటప్పటికి వెంటనే ఈ మాట అనేస్తాడు—"నేను రాసింది నీకోసం కాదు."

"మరెవరికోసం?"

రచయిత తెలివిగలవాడు అవటంవల్ల ఈ ప్రశ్నకు సమాధానాలు వెతుకుతాడు.

"నేను రాసేది రసహృదయులకు."

"నేను రాసేది సహృదయులకు."

"ఈ రసహృదయులూ, సహృదయులూ ఎవ్వరు?" అని ప్రశ్నిస్తే తాను రాసింది బాగుంది అని చెప్పేవారే అని తెలుతుంది.

ఇదంతా కూడా, ఈ ఆర్గుమెంట్లన్నీ కూడా తన ప్రయత్నం నిష్ఫలమైందనే ఆశాభంగంవల్ల కలిగినవేగాని, యథార్థమైనవి కావు. తాను అనేక పుస్తకాలు చదివాడు. తన కాలాన్నంతా చదువుకే వెచ్చించాడు. ఆర్థికంగా అనేక కష్టాలు పడ్డాడు. సంపాదన వైపుకి చూపుని పోనివ్వకుండా పుస్తకాల తాళింపుతో తన మెదడుని వేయించాడు. ఇంతా చేసి, తీరా పుస్తకం రాసేటప్పటికి యిదా ప్రతిఫలం! కసితో ప్రజలను దూరం చేసుకునే వాదంలేవదీస్తాడు. "కళ కోసం కళ—నా కోసమే నేను రాస్తున్నాను" అంటాడు. "ఎక్కడో ఒకడుండి ఆనందిస్తే చాలదూ?" అని తృప్తి పడతాడు. "పోనీ, ఇప్పటివాళ్ళకి అర్థం కాకపోయినా, పుట్టే వాళ్ళు ఆనందించరూ?" ఇలా అనుకొని తన తత్వాన్నే బలపరచుకోటానికి ప్రయత్నిస్తాడుగాని, ప్రజలకు అర్థమయ్యే రుచించే పద్ధతికోసం వెతకడు, పైగా యిందుకు ప్రయత్నించటం తన పరువుకి నష్టమనుకునే స్థితికూ్కడా వస్తాడు.

రచయితలందరూ ప్రజలకు తాము రాసేది బాగుండాలనే రాస్తారుగదా! కొన్ని కొన్ని రచనలు ప్రజలకు బాగుండక పోవటానికి కారణం ఏమిటి? అప్పుడు రచయితలు ఏం చెయ్యాలి? అని కొందరు ప్రశ్నిస్తారు.

"ప్రజలు అజ్ఞానులు" అని చెప్పి వాళ్ళను వొదిలి పెట్టటంలో అర్థంలేదు. ఎందుకంటే ప్రజలు అజ్ఞానులూ, తాను జ్ఞానీ కావటంవల్లే తాను రాయటం, వాళ్లు చదవటం జరుగుతూవుంది. ఇక జ్ఞానులకే రాస్తానంటాడా? జ్ఞాని,

తాను రాసింది చదవాల్సిన స్థితిలో వుండడు. తానే రాసి చదివించుకునే స్థితిలో వుంటాడు.

రచయితకు రాయాలనే కోర్కె మొదట్లో కలిగి నప్పుడు ప్రజల శ్రేయస్సే కారణంగా వుండదు. అసలు ప్రజలనేవాళ్లున్నారనీ వాళ్లు చదివి ఇంతో అంతో బాగు పడ్డానికి పుస్తకం రాస్తున్నాననే సంగతే రచయితకు తట్టదు. ఎంతసేపూ పుస్తకం రాయాలనే అభిలాషే. అభిలాష! పుస్తకం రాయాలి! పుస్తకం అచ్చవ్వాలి! గ్రంథకర్తగా పేరు పడాలి! నేను చూచుకోవాలి! అనే రంధి తప్ప, ప్రజలకు అర్థమయ్యేటట్టు రాయాలనే సంగతే తట్టదు.

పుస్తకాలు రాసి పేరు సంపాదించుకున్న వాళ్ళని చూస్తాం; పేరు సంపాదించుకొని సన్మానాలు పొందేవాళ్ళని చూస్తాం; మనకూ పుస్తకం రాయాలనే ఉబలాటం కలుగు తుంది. అభిమాన రచయితల్ని అనుకరిస్తాం. బొత్తిగా కాపీ కొట్టటం మనస్కరించక ఒక రచయిత టెక్నిక్కూ, ఒక రచయిత భావాలూ తీసుకొని పెనవేసి పుస్తకాన్ని పూర్తి చేస్తాం. పై యిద్దరికంటే మంచి పుస్తకం రాశాం అను కుంటాం.

ఈ విధంగా భావాలూ రచనా పద్ధతీ తెచ్చుకుంటాం. ఇక శైలి విషయం వస్తుంది. ఇదివరకు రాసే అలవాటు లేక పోవడంవల్లా, కృషి తక్కువ అవటంవల్లా మనశైలి మనకే తృప్తికరంగా ఉండదు; ఏదో లోపమున్నట్టుగా వుంటుంది; కుంటు పడ్డట్టుగా ఉంటుంది.

ఏం చెయ్యాలి?

తేలిక పద్ధతులకు అలవాటుపడ్డ ప్రాణం అవటంవల్ల మరొక తేలిక పద్ధతి ఆలోచిస్తాం. మనం చదివిన పుస్తకాలు తిరగవేస్తాం. మంచి మంచి మాటలూ, సమాసాలూ యేరుకుంటాం. మన పుస్తకంలో కుక్కి సొంతం చేసుకుంటాం.

అందువల్ల శైలి ఒకరకంగా వుండదు. పేజీ పేజీకి మారుతుంది. పేరగ్రాఫ్ పేరగ్రాఫ్‌కీ మారుతుంది. ఎవ్వరైనా ఈ లోటు చూపిస్తే దిద్దుకోటానికి ప్రయత్నించక ఒక కారణం ఊహించి తపీమని వాడి మొహాన విసిరికొడతాం.

"రసాన్నిబట్టి శైలిని మార్చానోయ్! గ్రహించ లేకపోతే, ఆస్వాదించ లేకపోతే—ఊరుకో" అంటాం.

అతడు మనస్సులో అనుకోవలసిందేదో అనుకొని, పైకి మెదలకుండా ఊరుకుంటాడు. మనమేమో, 'గెలిచాం; నోరు మూయించాం' అని భుజాలు ఎగరవేస్తాం.

ఇక, పుస్తకం అచ్చయి వొస్తుంది. మనం రాసిందే పదే పదే చదువుకుంటాం—ఎన్నిసార్లు చదివినా తనివి తీరందే! పైగా రాసినప్పటికంటే, అచ్చయిం తర్వాత ఇంకా అందంగా కనిపిస్తుందాయెను!

గ్రంథకర్తగా అచ్చయిన మనపేరు మనల్ని ఎంతగా ఆకర్షిస్తుంది! ఎన్నిసార్లు చదువుకుంటాం! ఎన్నిసార్లు చూచుకుంటాం! ఆ పేరు—మన పేరే!—ఎక్సర్‌సైజ్ పుస్తకాలమీదా, పరీక్ష పేపర్లమీదా, టెక్స్టు బుక్కులమీదా, ముద్దుగా, బండగా, గొంగళి పురుగులాగా కనబడే ఆ పేరే, ఇప్పుడు గ్రంథకర్తగా ఎంత ముద్దులొలుకుతూ కనిపిస్తుంది!

ఆ స్థితిలో రచయిత తనకు తానే, తన పేరునే మోహి స్తాడు—కామిస్తాడు—కాదు ప్రేమిస్తాడు. పుస్తకంమీద పేరుని చూచుకొని, పుస్తకాన్ని రొమ్ముమీద పెట్టుకొని నిద్రపోయి, రెండు రాజహంసలు తన పేరుని తలొక చివరా ముక్కుల్తో సుతారంగా పట్టుకొని, రివ్వున యెగిరి ముత్యాల హారాన్ని పట్టుకపోతున్నట్లుగా స్వర్గానికి ఎత్తుక పోతున్నట్లు కలలు కంటాడు!

ఈ అవస్థలో ప్రజలకు తావేముంది! ఈ పుస్త కాన్ని ప్రజలు ఆదరించకపోవటంలో ఆశ్చర్యమేముంది? ఆర్గుమెంట్సు చెప్పటంవల్లా, ప్రజలను నిందించటంవల్లా ప్రయోజనం ఏముంది?

ఎవరయినా కనిపిస్తే "నా పుస్తకం ఎలావుంది?" అని అడగటానికి భయం వేస్తుంది. బాగులేదంటే! అందుకని ఎలావుందని అడక్కుండా - మనస్సు ఒకపక్క పీకుతున్నా సరే! పిచ్చాపాటీ మాట్లాడి అతనికి అవకాశం ఇవ్వకుండా దూసుకుంటాం. లేకపోతే, మనం ఏంరాసినా బాగుంటుం దని చెప్పే స్నేహితుణ్ణిపట్టుకొని అడుగుతాం. "నా పుస్తకం చదివావా?"

"చూశాను" అంటాడు.

'చదివావా?' అని అడిగితే 'చూశాను' అని చెప్పి నందుకూ, 'ఎలావుంది?' అని అడక్కుండానే 'బాగుంది' అని చెప్పనందుకూ, విసుగుపుడుతుంది. విసుగుతోనే "ఎలా వుంది?" అని అడుగుతాం.

"బాగానే వుంది" అంటాడు.

"బాగానేవుందా? బాగుందా?"

"బాగుంది."

"బాగుందా? చాలా బాగుందా?"

"చాలా బాగుంది"

ఈ విధంగా చెప్పించుకొని తృప్తిపడతాం. ఇక ప్రజలకు నచ్చలేదు అనడంలో అర్థంలేదు. అందుకు ప్రయత్నమేదీ? ఇదొక రకం.

రచయితల్లో మరొక రకంవుంది. భాషలో ఎక్కువ కృషి చేసి, భావాలకంటే భాషకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుంటారు. కాని భాషకోసం ఈరోజుల్లో ఎవరు పుస్తకాలు చదువుతారు? భావదారిద్ర్యాన్ని భాషాపాండిత్యంతో కప్పిపుస్తే ప్రజలు ఆ పుస్తకాలు ఎందుకు చదువుతారు? ఒకవేళ చదివినా ఎలా ఆనందిస్తారు. కనక ఈ రకంకూడా "వాళ్ళకు నచ్చలేదు" అనే తృప్తిపడాల్సి వొస్తుంది. "మేం పండితులం, భాషలో బాగా కృషిచేశాం. వ్యాకరణం శుద్ధంగా చదువుకున్నాం. అయినా ఈ మూఢులు మమ్మల్ని ఆదరించటంలేదు" అనుకోవటంవల్ల వూడిపడే దేమీలేదు.

నేను రాసిన పుస్తకం చదవమనీ ఒక పెద్దమనిషి కిచ్చాను. అతడు తీసుకువెళ్ళి, రాత్రి చదివి, తెల్లవారగట్ట భద్రంగా తీసుకువచ్చి ఇచ్చాడు.

"ఎలావుంది?" అని అడిగాను.

"స్వాభావికత్వం అని రాశారే! అక్కడ కరారావడి కాదు వుండవలసింది. వత్రసుడి ఉండాలి" అన్నాను.

అంతే! ఇంతకు తప్పితే అతను పుస్తకాన్ని గురించి ఏమీ చెప్పలేదు. ఈ అభిప్రాయం తప్పనిగానీ, ఈ అభిప్రాయం రైటనిగానీ, ఈ అభిప్రాయం బాగుందనిగానీ, ఈ అభిప్రాయం బాగాలేదనిగానీ ఏమీ చెప్పలేదు. అసలు ఆ పుస్తకంలో నేను వెలిబుచ్చిన అభిప్రాయాల జోలికి అతడు వెళ్ళేఉండడు. "ఆ కరారావిడి తీసి వత్రసుడి పెట్టండీ" అని చెప్పి నా పుస్తకం నాకిచ్చి తనదారిన తాను వెళ్ళాడు.

ఇతడు తర్వాత ఒక పుస్తకం రాశాడు. ఎక్కడ కరారావిడి పెట్టాలో అక్కడ కరారావిడి పెట్టాడు. ఎక్కడ వత్రసుడి ఉంచాలో అక్కడ వత్రసుడి ఉంచాడు. ఎక్కడ బండిరా పెట్టాలో అక్కడ బండిరా పెట్టాడు.

కాని అంతే!

భాష, భావాలను వెలిబుచ్చటానికి ఉపయోగపడే సాధనం మాత్రమే అనే సంగతే మరచిపోయాడు. బండి రాళ్ళలో కరారావళ్ళలో పడి అసలు భావాలను గురించి ఆలోచించటానికే తీరిక ఉండిఉండదా! ఇలా రాసిన పుస్తకాలు ప్రజలకు నచ్చమంటే ఎలా నచ్చుతయ్? మనం ఎన్ని గ్రంథాలు చదువుకుంటే వాళ్ళకేం? ఎన్ని సూత్రాలు మననం చేస్తే వాళ్ళకేం?

రచయితలకూ, ప్రజలకూ కలవకపోవటంవల్ల వచ్చే బాధలను కొంతమంది రచయితలు చూస్తారు. చూసి యీ

బాధలు తప్పించుకోటానికి సులిసూత్రం ఒకటి కనిపెడతారు. అదేమిటంటే ప్రజల్లో వ్యాపించివున్న మూఢాచారాలను తేలిక భాషలో వాళ్ళకు అర్థమయ్యేట్టు పొగట్టం. ఈ రకం రచయితలకు, కావలసినంత ప్రజాదరణ వుంటుంది. "రాస్తే, ఆయన రాసినట్టు రాయ్యాలా" అంటుంది ప్రజ. కాని వీళ్ళ వల్ల మిగిలిన వాళ్ళందరికంటే ప్రజలకు ఎక్కువ అపకారం కలుగుతుంది. వాళ్ళని ఇంకా అజ్ఞానదశకు తీసుకుపోవటానికే వీళ్ళు ఉపయోగపడతారు. "వాళ్ళకు నచ్చలేదు–" అనే చింత వీళ్ళకు లేదు. ప్రజలు వీళ్ళపక్షమే వుంటారు. కాని, ప్రజల శ్రేయస్సు కోరేవాళ్లుమాత్రం వీళ్ళకు ప్రజాదరణ లేకుండా చెయ్యాలి. ప్రజల ఆదరం ఒక్కటే ఉత్తమగ్రంథ లక్షణంకాదు. ప్రజల శ్రేయస్సుకు సహాయపడే భావాలు వెలిబుచ్చుతూ వాళ్ళ ఆదరాభిమానాల్ని సంపాదించాలి.

ఇలా రాసే రచయితలు మరొకటి గమనించాల్సి వొస్తుంది. మొదట్లో "వాళ్ళకు నచ్చలేదు" అని బెదిరిపో గూడదు. వాళ్ళు అలవాటుపడ్డ సంస్కారానికి భిన్నంగా రాయటంవల్ల ప్రజలు కొద్దికాలం నిరాదరణ చూపిస్తారు. కాని—కొద్దికాలం మాత్రమే. రోజులు గడిచినకొద్దీ ఈ రచయితలకే పలుకుబడి ఎక్కువ అవుతుంది. "వాళ్ళకు నచ్చ లేదు" అని విచారపడవలసిన అవసరం వుండదు.

వాళ్ళకు తప్పకుండా నచ్చితీరాలి. ఎందుకంటే వాళ్ళకోసమేగా! రచయితలు సరిగ్గారాస్తే నచ్చకపోవటం అనేది ఉండదు. నచ్చలేదని నిదించటం కానీ, విచారిం చటం కానీ మంచిలక్షణం కాదు.

కనక ప్రజాసామాన్యానికి శ్రేయస్సు కూర్చే భావాలను వాళ్ళకు నచ్చేటట్టు చెప్పటమే ఉత్తమ రచన అవుతుంది.

[ఇందులోని భావాలు 'నచ్చలేదు' అనే
నా రేడియో ప్రసంగంలోవి.]

## ఆత్మ విశ్వాసం

ఈమధ్య భాషాభిషక్కుల్లో చాలా అహంకారం బలిసినట్లు కనిపిస్తుంది. దీనికికారణం ఏమిటా అని నేను చాలా ఆలోచించాను. నాకు ఒక్కటే తట్టింది. చాలామంది పెద్దవాళ్ళు ఆత్మవిశ్వాసం మనిషికి అవసరమనిచెప్పారు. ఈ అభిప్రాయమే భాషాభిషక్కుల్లో అహంకారాన్ని పెంచిందని నా అనుమానం.

కాని ఈ భాషాభిషక్కులు ఒక సంగతిమాత్రం మరచి పోగూడదు. ఆత్మవిశ్వాసం రెండురకాలుగా కలుగుతుంది. ఒకటి జ్ఞానంవల్లా; రెండు అజ్ఞానంవల్లా.

సర్వమూ తెలుసుకొని, అందరికంటే నాకు ఎక్కువ తెలుసని ఒకరను కుంటారు. బాహ్యప్రపంచమే తెలియకపోవటంవల్ల అందరికంటే నాకు ఎక్కువ తెలుసని ఒకరనుకుంటారు.

మన భాషాభిషక్కులు ఈ రెండోరకానికి చెందుతారేమో నని నా భయం.

ఈమాట అన్నానని కోప్పడపద్దు. మాన్పుకోవటం మంచిది. లేకపోతే ఆత్మవిశ్వాసాన్ని పొందేటంత జ్ఞానాన్ని సంపాదించటం మంచిది.

—o—

# వర్గ చైతన్యం

భావాలు సంఘపరిస్థితుల్ని బట్టి కలుగుతై. మొదట్లో ప్రజాసామాన్యం నూతన భావాలను స్వీకరించక ఎదురు తిరుగుతుంది. ఆ భావాలను వెలిబుచ్చినవాణ్ణి "రెటమత సిద్ధాంతి" అనీ, "వికట కవి" అనీ, ఇంకా అనేక విధాల హింసిస్తుంది. కాని క్రమేపీ ఈ నూతన భావాలు ప్రచారం లోకి వస్తయ్. ప్రజాసామాన్యం వాటిని ఆదరిస్తుంది. మరి కొన్నాళ్ళకి ఈ భావాలే సాంప్రదాయాలుగా తయారవుతై. మొదట్లో సంఘానికి మేలు చేకూర్చటానికి అంకురించిన ఈ భావాలు, సాంప్రదాయాలుగా మారింతరువాత చిట్టం కట్టి సంఘాభివృద్ధికీ, మానవశ్రేయస్సుకీ, ఆటంకాలవుతవి. అప్పుడు విప్లవ దృక్పథం కలిగిన కవులూ రాజకీయవేత్తలూ ఆ సాంప్రదాయాల్ని బద్దలకొట్టి, సంఘాన్ని ఒక మెట్టు ముందుకు తీసుకుపోవటానికి పూనుకుంటారు. అలా చెయ్యక ఇవి మన సాంప్రదాయాలనే మోజుతో వాటినే పొగుడుతూ కూర్చునేవారు మాత్రం విద్రోహులుగా నాశనకారులుగా పరిగణింప బడతారు.

సంఘాన్ని ముందుకు వెళ్ళనివ్వకుండా అరికట్టి, సహజాభివృద్ధిని ఆటంకపరచి, సంఘాన్ని కుళ్ళబెట్టటానికి పూనుకున్న ఈ సాంప్రదాయాలను బద్దలగొట్టటమే రామస్వామి చౌదరిగారు చేసినపని.

ఆనాటి సంఘంలో అగ్రజాతి మిగిలిన జాతులను బానిస జాతుల్నిగా తయారుచేసి, అజ్ఞానాన్ని పెంపొందించు కోవడమే వాటికి ధర్మంగా నిర్ణయించిపెట్టి, తన స్వలాభం కోసం పీడించటం మొదలుపెట్టింది. భిన్న నీతులు, భిన్న ధర్మాలు, భిన్న ఆదర్శాలు సృష్టించి పెత్తనం చేస్తూవుంది. చౌదరిగారు అల్పసంఖ్యాకమైన ఈ వర్గంయొక్క నిరంకుశ త్వానికి ఎదురుతిరిగి, ఈ నిరంకుశత్వంలో పడి నలిగిపోయే ప్రజాబాహుళ్యానికి దాస్యవిమోచనం చెయ్యటానికి కంకణం కట్టుకున్నారు. ప్రజాబాహుళ్యం ఈ దాస్యాన్ని ఎందుకు సహిస్తూవుంది? అగ్రజాతి తన అధికారాన్ని యెలా నిలబెట్టు కోగలుగుతూ వుంది ? ప్రజాబాహుళ్యం తన అద్భుతశక్తిని ఎందుకు గ్రహించుకోలేకపోతూ వుంది ? అగ్రజాతి ఏ యే యుక్తులవల్ల పెత్తనం చెయ్యగలుగుతూ వుంది ?

ఒక వర్గం అధికారంలోకి వచ్చి మిగిలిన వర్గాల్ని పీడించటం మన సంఘం యొక్క ప్రత్యేకత కాదు. దీన్ని ఆధ్యాత్మిక నాగరికత అని పొగడుకో నక్కరలేదు. ప్రపంచ చరిత్రను చూస్తే ప్రతి దేశం ఈ అవస్థను ఎప్పుడో ఒక ప్పుడు అనుభవించే వుంది. కాని ఆ యా దేశాలు పై వర్గం మీద జయప్రదంగా విప్లవాలుచేసి బానిసత్వాన్ని పోగొ ట్టుకో గలిగినయ్; మనం మాత్రం అందులోనే పడి కొట్టు కుంటున్నాం——! ఇంతే భేదం. అల్పసంఖ్యాకులు ఏ విధంగా ఏ యుక్తులతో, ఏ సాధనాలతో ప్రజాబాహుళ్యాన్ని దాస్యంలో వుంచి తాము పెత్తనం చెయ్యగలుగుతున్నారో విచారిద్దాం. దీనికి మూడు పద్ధతులున్నాయి——

1. తమ అధికారాన్ని నిలబెట్టే గ్రంథాలను ఆదర్శ గ్రంథాలుగా, పూజ్య గ్రంథాలుగా ప్రజలను నమ్మించటం.

2. స్వర్గం-నరకం అనే వాటిని సృష్టించి, అప్పటి సాంప్రదాయాలకు విరుద్ధంగా నడిచేవారు నరకంలో యమ యాతన అనుభవిస్తారని భయపెట్టి, అప్పటి సాంప్రదాయాలకు కట్టుబడి బానిసత్వంలో జీవితం వెళ్ళబోసుకున్న వాళ్ళకి స్వర్గసుఖాలు చేకూర్తాయని చెప్పి పూరించి, మోసం చెయ్యటం.

3. దేవుణ్ణి సృష్టించి, మిగిలిన వర్గాలకు జరిగే అన్యాయాలనూ, అక్రమాలనూ కర్మ సిద్ధాంతానికి ముడిపెట్టి, మతం అనే మత్తుమందు చల్లటం.

కనుక అగ్రజాతియొక్క అధికారాన్ని రూపుమాపాలంటే, అది ఉపయోగిస్తున్న సాధనాలను నిర్వీర్యం చెయ్యాలి. చౌదరిగారు ఇది గ్రహించి ముందు ఈ సాధనాలను ఏ విధంగా నిరుపయోగం చేశారో వివరిస్తాను—

భారత భాగవత రామాయణాలూ, ధర్మశాస్త్రాలూ, పూజ్యగ్రంథాలు కావనీ, ఒక వర్గం తన అధికారాన్ని సుస్థిరం చేసుకోటానికీ, మిగిలిన వర్గాల్ని దాస్యంలో వుంచటానికీ, వ్రాసిన గ్రంథాలనీ ప్రచారం చేశారు. రాముడి కంటే రావణుడు గొప్పవా డన్నారు. పాండవులకంటే కౌరవులే నీతిపరు లన్నారు. ప్రహ్లాదుణ్ణి పితృహంతకునిగా వర్ణించారు. ఈ సందర్భంలో 'శంబుకవధ'లోని ఈ దిగువ సంభాషణ ముఖ్యంగా గమనించదగ్గది.

శంబుకుడు

కుమారా! అంగదా! నీ సంశయముల దీర్తునుగాని మన శాస్త్రములనుచుంటివి; ఎవరి శాస్త్రములని నీ ఆశయము?

అంగదుడు

ఆర్యులు చెప్పిన స్మృతు లవి.

శంబుకుడు

అవి మన వెట్లగును?

అంగదుడు

ఇందు భిన్నాభిప్రాయుండను. మన వెట్లు కావో తెలియకుంటిని.

శంబుకుడు

తెలియ జెప్పెద వినుము.
ఋషులొ పు రెవ్వరో వలావు రెచ్చటనో గుమిగూడి తాము క
ల్మషమతి బక్షపాతముగ లక్షల గ్రంథము వ్రాయగా నకి
ల్బిషము లటంచు నెత్తినయి పెట్టుక పూజ యొనర్ప నేర్తమే!
ఋషులకు మాత్ర ముండవలదే ఋజుమార్గము వాలినందనా!

ఇట్లు వ్రాయబడిన శాస్త్రములు మన శాస్త్రము లెట్లగును? మనకుగా వ్రాసిరా? మన యభిప్రాయముల గొనిరా? కానిచో మన మేల వానిచే బంధింపబడవలయు?

ఇప్పుడిప్పుడూ కొందరు, చౌదరిగారు ఈ గ్రంథాల మీద వ్రాసిన విమర్శలు చదివి ఈవిధంగా ప్రశ్నిస్తున్నారు– 'రాముడు మంచివాడు కాకపోతే పోయాడు. రావణుడు మంచివా డెలా అవుతాడు?' 'హిరణ్యకశిపుణ్ణి విష్ణువు నరసింహ రూపంలో చంపకపోతే పోయాడు, స్తంభంలో

సింహాన్ని తెచ్చి ఎలా బిగించారు?' 'పాండవులు ధర్మా
త్ములు కాకపోతే పోయారు, కౌరవులెలా గొప్పవారయ్యారు?'
'పన్నెండు సంవత్సరాలు దాటితే ఈ రోజుల్లో లిమిటేషన్
పడుతుంది గాని, ఆ రోజుల్లో పాండవులకు రాజ్యార్హత
లేకుండా పోవటానికి ఇది కారణం ఎల్లా అవుంది?'

ఇలా ప్రశ్నించేవారికి అసలు చౌదరిగారి పుస్తకా
ల్లోని ఫిలాసఫీయే అర్థం కాలేదేమో నని నా భయం. ఎందు
కంటే చౌధరిగారు ఈ పుస్తకాలు రాయటానికి కారణం
ఏమిటి? రావణుడు గొప్పవాడని నమ్మమనా? కాదు.
హిరణ్యకశ్యపాదులు గొప్పవారని నమ్మమనా? కాదు.
దుర్యోధనాదులే రాజ్యార్హులనీ పాండవులకు రాజ్యంలో
హక్కు లేదనా? కాదు. మరింకేమిటి? పూజ్య గ్రంథాలనే
వంకతో ప్రజాసామాన్యాన్ని బానిసత్వంలో వుంచటానికి
సహాయపడే గ్రంథాలమీద పూజ్యభావం లేకుండా చెయ్య
టమే, వారి రచనల ఆదర్శం—'పూజ్య గ్రంథాలయిన
భారత భాగవత రామాయణాల్లోని విషయాలెంత సత్యమో,
ఈ గ్రంథాల్లోని విషయాలూ అంతే సత్యం' అంటే ఆయన
ఆదర్శం నెరవేరినట్లే! 'కవులు కూర్చుని ఏదైనా వ్రాస్తారు.
అవన్నీ గుడ్డిగా నమ్ముతూ కూర్చుంటే ఎట్లా?' అని ప్రజా
సామాన్యం అనుకుంటే ఆయన కృతకృత్యులైనట్లే! కనుక
ఆయన రచనల విలువ తెలుసుకునే పద్ధతి ఆయన చెప్పిన
ప్రతి ఆర్గ్యుమెంటూ తప్పా ఒప్పా, అని ఆలోచించటం
కాదు—ఆయన ఈ విధంగా రాయటంవల్ల పూర్వగ్రంథాల

మీాద విలువ తగ్గించా, లేదా? అని ప్రశ్నించుకోవటం. అలా జరిగితే ఆయన సారస్వతసేవా, కృషీ, ఫలించినట్లే!

శంబూక వధలో శంబుకుడు యిలా అంటాడు: 'కవి లేఖినికి విశ్వామిత్ర సృష్టిజేయు శక్తి గలదు' కుప్పుస్వామి శతకంలో ఇదే అభిప్రాయం ఈ క్రింది పద్యరూపకంగా వెలిబుచ్చారు.

రఘుకులంబునఁ బుట్టరే రాము కన్న
గొప్పవారు? వారల పేరు లెప్పుడైన
వింటిమే? సత్కవి కటాక్షవితతి చేత
గొప్పవాఁడయ్యె రాముండు కుప్పుస్వామి!

అందుకనే తనకు సూత మహర్షి పురాణాలు చెప్పినట్లూ,

పాదలేపనంబు పట్టింప నలరాల
మింటి కెగసినాఁడ మంటినుండి
తెల్లవారలేదు దిగినాఁడ మాయూరి
చెఱుపుగట్టు క్రిందిచెట్టుక్రింద

అనీ వ్రాశారు. మీాకు సూతమహర్షి యెలా పురాణాలు చెప్పాడు? పాదలేపనం రాసుకొని యెలా మింటి కెగశారు! అని ప్రశ్నిస్తే, 'పూర్వ గ్రంథాల్లోని విషయాలు నమ్మితే, ఇవీ నమ్ము! అవి నమ్మకపోతే ఇవీ నమ్మకు!' అని జవాబు చెపుతారు.

ఇక స్త్రై పస్గం అధికారానికీ, క్రింది వర్గాల దాస్యానికీ, కారణభూతాలైన స్వర్గనరకాలను ఏ విధంగా విమర్శించి వాటినుంచి ప్రజలనేవిధంగా రక్షించారో విచారిద్దాం.

దాగు శివ శివా, ఇది పట్టి భోగభూమి
ఉండరా దిందు మావంటి యోగులకును !

తిని తిరగటం తప్ప స్వర్గంలో మరేమీ (ఒక పని తప్ప) పని ఉండదు. ఏ సమస్యలూ వుండవు. సోమరితనం వల్ల చివికి జీర్ణించిపోయిన నాగరికతకు ఆటపట్టు అయిన స్వర్గాన్ని గురించి ఖూనీ నాటకంలో ఇలా వ్రాశారు—

వేనుడు

శునశ్శేఫా, ఇంతకును చెప్పవైతివి. ఉత్తమలోకము లనగా నేమి? స్వైరవిహారము, సురాపానము, వృద్ధవేశ్యావనితాజనతా పాంగ వీక్షణములేనా?....ఇవియే యైనచో ఈ భూలోకంబున దొరకవా? విచ్చలవిడి తిరుగరాదా? ముదుసలి వడుపుగత్తెల కౌగిళ్ళ, కులికి కులికి లాలాద్రవంబును జవిచూడరాదా.....?

ఇక ఈ స్వర్గం ఎవర్ని ఆకర్షిస్తుంది? ఈ స్వర్గం కావాలని ఎవ్వరు ఆపేక్షపడతారు? ఈ స్వర్గం కోసం ఎవ్వరు భౌతిక సుఖాలను వదులుకొని బానిసత్వానికి లోబడతారు? నరకం ఎవ్వర్ని బెదిరిస్తుంది? ఈ నరకానికి భయపడి ఎవ్వడు అగ్రజాతి నాగరికతకు లోబడి, దాస్యం చేస్తాడు?

తరువాత అగ్రజాతి అధికారానికి మూడో సాధన మైన దేవుని యొక్క, మతం యొక్క విలువను తగ్గించ టానికి చౌదరిగారు చేసిన ప్రయత్నాన్ని విచారిద్దాము—

వేనుడు

ఎవ్వడు నాకి నరకలోకము విచ్చునది?

శునశ్శేఫుడు

భగవంతుడు.

వేనుడు

ఎవ్వడీ మహాపురుషుడు? ఆయన ప్రకృతి యేమి? ఇంతవర కెప్పుడును నా రాజ్యంబున గన్పట్టలేదే? ఇంతకు చెప్పవైతివి; ఆయన ఉద్యోగ మేమి?

శునశ్శేపుడు

సర్వాంతర్యామి! సర్వ ప్రపంచ సృష్టి స్థితిలయ హేతుభూతుడు. దుష్టుల శిక్షించుట, శిష్టుల రక్షించుట ఆయన ఉద్యోగము. అహోరాత్రము లీ ప్రపంచము గనిపెట్టుకొని యుండు.

వేనుడు

పాపము ఎంత బాధపడు చుండెనో నిద్రాహారములు మాని, రేబవలు కనిపెట్టుకొని యుండి? ఆ మహామహుడేనా నాకు నరక లోకము దానము చేయునది? జీవహింస సల్పుచున్నందులకు మీకు స్వర్గము, దానిని మాన్పుచున్నందులకు మాకు నరకము! ఆ దేవుని మీరు క్రొత్తగా సృజించినటులున్నారు. ఆ మీ దేవుడు తన ధర్మమునుగూడ మరచువాడుగ నున్నాడు. ఎంతమంది దుష్టులు శిక్ష తప్పించుకొని పోవుచున్నారు. లోకమున ఎంత మంది శిష్టులు శిక్షింపబడుచున్నారు.

గౌతముడు

కటకటా! భగవానుడు కూడ నీ పరిహాసమునకు పాత్రుడయ్యె! నీకు ప్రాయశ్చిత్తమే లేనట్లున్నది.

వేనుడు

నాకు ప్రాయశ్చిత్తమే లేనట్లున్నది: నీకు చిత్తమే లేనట్లున్నది.

శునశ్శేపుడు

ఏమీ!

వేనుడు

లేనిచో దృగ్గోచరుడు కానివాడును, మానవులచే సృజింప బడిన వాడును సృష్టి స్థితి లయ కారణమేమి? సృష్టి స్థితి లయములు స్వభావ జన్యములు కావా?

గౌతముడు

పాపము శాంతించును గాక!

వేనుడు

నీవు చెప్పిన చొప్పున భగవంతునకు నీ ప్రపంచమున నిత్యము జరుగుచున్న కార్యక్రమమునందు బెత్తనమే యున్నయెడల విన్ని ఘాతుకకృత్యము లేల జరుగుచుండును? వీని నణంచలేడా?

శునశ్శేపుడు

మానవుడు కర్మప్రేరితుడై చేయుచున్న కార్యముల నెవ్వడు మాన్పగలడు?

వేనుడు

అయినచో భగవంతుడు నిష్ప్రయోజకుండా?

గౌతముడు

నిష్ప్రయోజకుం డెట్లగును? అతడు సర్వ కర్మలకు సాక్షి.

వేనుడు

కూటసాక్షియా? ఎందుల కీ సాక్షిత్వము? తన కన్నెదుట జరుగుచున్న క్రూర కర్మముల మాన్ప నేరక సాక్షియగుచున్నాడా? ఏమి చిత్రము? ఈ సాక్ష్యము యెవ్వని యెదుట ఉపయోగ పడును? ఎవ్వరికి ప్రయోజనకారి యగును? విచారణ కర్త ఎవ్వరు?........లోకము కన్గప్పి మీ దుర్వ్యవసాయమునకు తోడ్పడ భగవంతుని నొకని సృజించి,-లేనిపోని సర్వ శక్తులు వానికంటగట్టి, జగమును నట్టాత లూగింప యత్నించుచుంటిరి.

ఈ సందర్భంలో సూతపురాణంలోని మహాకవి పద్యాన్ని ప్రస్తావిస్తున్నావుంది. మొదటి ఆశ్వాసంలో—

విభుఁడొకఁడు చేయునంట పై పెత్తనంబు
కర్మ మొకఁడు సంసారచక్రంబు త్రిప్పు
నంట !! ద్వంద్వ ప్రభుత్వమిం దమరలేదె ?
ఎంత కాలంబు సాగునో ఇట్టి చిట్ట !!

దైవభక్తిని గురించి కుప్పుసామి శతకంలో యీ విధంగా వ్రాశారు:—

గుడికి తరచు పోయి గొబ్బుఁగు చుండెడివాఁడు
పెద్ద పాపమేదొ చేసియుండు
నదియె వానిఁబట్టి యట్టిట్టు పీకు-చు
గుడికి పోవు నతడు కుప్పుసామి.

పాతకునిచేత నెప్పుడు గీతయుండు
మొగముపై వింత వింతగ బొట్టులుండు
తిన్నె దిరిగి మె పునస్సాపేషి సన్నగిలిన
యప్పుడు దనాశ కెందును కుప్పుసామి.

ఈ విధంగా రాసి చివరికి దేవుని గురించి యీ విధంగా ముగించారు— —

మానవుడు మృగదశలో నున్నప్పుడే కొండగానో, ఏ యేరు గానో, వెలసిన దేవుడు, మానవ జ్ఞానము పరిణామము బొందు చున్నకొలది, భగవంతు డేరు-కొండరూపమును వదలి, మృగమై, మృగమునుండి మనుష్యుడై, మనుష్య దశనుండి యదృశ్య రూపుడై, నిరాకారుడై, నిరంజనుడై, నిర్వికల్పుడ య్యెను, ఇక తరువాత దశ యేమి ? శూన్యత్వము అనగా నాస్తికత్వము...,

ఇలా అగ్రజాతి అధికార సాధనాలను విమర్శించి హేతువాదానికి స్థానమిచ్చి, బానిస ప్రజలకు చైతన్యాన్ని కలిగించి మూఢవిశ్వాసాలను పోగొట్టి, అగ్రజాతి నిరంకుశత్వం యొక్క పునాదులను ఊడగొట్టారు.

ఇప్పటి కవులలో లేని గొప్ప విశేషం మరొకటి చౌదరి గారిలో వుంది. అదేమిటంటే సాధారణంగా మన కవులు భావాలను వెలిబుచ్చటం తప్ప వాటిని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించరు. పుస్తకాలు రాయటం తమ పనీ, కార్యాచరణకు పూనుకోవటం మరొకరి పనీ అనుకుంటారు. ప్రజాసామాన్యంతో సంబంధం పెట్టుకోటానికే ఇష్టపడరు. ప్రజాసామాన్యం నాగరికతను చూసే ఏవగించుకుంటారు. ఇక వారిలో కలిసి మెలిసి ఎలా తిరగగలరు ?

చౌదరిగారు మాత్రం అలా కాదు. ఆయన కార్యవాది. తన అభిప్రాయాలను ఆచరణలో పెట్టటానికి ప్రయత్నిస్తారు. ఆచరణ యోగ్యములు కాని భావాలవల్ల కానీ, కార్యరూపం తాల్చని అభిప్రాయాలవల్ల కానీ, సంఘానికి ఏమీ లాభంలేదని ఆయనకు తెలుసు. అందుకని రాజకీయంగా జస్టిస్ పార్టీలో చేరి కృషి చేశారు.

మన సంఘంలో, 'ఈయన జస్టిస్‌పార్టీలో చేరకుంటే వుంటేనా ?' అనే అభిమానులు చాలామంది ఉన్నారు. ఇది పొరపాటు. సిద్ధాంతరీత్యా మొదటివర్గం మీదకు ఝగిలిన వర్గాల్ని విప్లవం చేయించటానికి పూనుకున్న వ్యక్తిని, క్రియలో మూడో వర్గాన్ని పై రెండు వర్గాలమీదకూ విప్లవం చేయించటానికి ఎందుకు పూనుకోరు ? అని ప్రశ్నిం

చటంగానీ, అలా వూనుకోవాలని వాంఛించటంగానీ కేవలం పొరపాటు. విప్లవకారుడు పరిస్థితులకు అనుకూలంగా విప్లవం లేవదియ్యాలిగాని ఊహాగానం చెయ్యగూడదు. విప్లవాలకు దగ్గరదారి లేదనే సత్యాన్ని మనం మరవగూడదు.

ఈ విషయమే విపులంగా చెబుతాను :—

మన సంఘం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్గాలుగా విభజింప బడింది. మొదట్లో బ్రాహ్మణ వర్గం అధికారంలో వున్నప్పుడు ఆ వర్గంమీాదకు మిగిలిన వర్గాలన్నీ కలిసి విప్లవం చేస్తాయి. కాని క్షత్రియ వర్గం అధికారంలోకి వస్తుంది. అప్పుడు క్షత్రియ వర్గంమీాదకు మిగిలిన రెండు వర్గాలూ విప్లవం చేస్తవి. కాని వైశ్య (Capitalist) వర్గం అధికారంలోకి వస్తుంది. అప్పుడు మిగిలిన శూద్ర వర్గం పై వర్గాలమీాదకు విప్లవం చేసి అధికారాన్ని వశం చేసుకుంటుంది.

కనుక మొదటి విప్లవాన్ని లేవదీసే కవినిగాని, రాజకీయ వేత్తనిగాని, రెండో విప్లవం లేవదీయ లేదనిగానీ, రెండో విప్లవానికి వూనుకున్న రాజకీయ సంస్థలో జేవ లేదనిగానీ, విమర్శించటం చారిత్రిక జ్ఞానం లేకపోవటం. మొదటి విప్లవం జరక్కుండా రెండో విప్లవం, రెండో విప్లవం జరక్కుండా మూడో విప్లవం జరగదు గనుక, వర్గసంబంధాలను బట్టి మూడో విప్లవంవల్ల లాభంపొందే వర్గం కూడా ప్రథమంలో మొదటి విప్లవానికే సహాయం చేయవలసి వస్తుంది. ఈ దృష్టితో చూస్తే జస్టిస్‌పార్టీ ఒకప్పుడు విప్లవ సంస్థే! జస్టిస్‌పార్టీ ఒక విప్లవం నడపబట్టే యిప్పుడు మరొక విప్లవం

చేయడానికి పరిస్థితులు అనుకూలించాయని కూడా మనం మరచిపోగూడదు. చారిత్రక దృష్టి గలిగిన ఎవ్వరూ యిది కాదనలేరు.

రష్యాలో, సోషలిస్టు ఉద్యమం రావటానికి ముందు నిహిలిస్టు ఉద్యమం పనిచేసింది. ప్రజలలో వున్న మూఢ విశ్వాసాలను పోగొట్టటమే దీని ఆదర్శం. ఈ విధంగా ముందే దారిని శుభ్రపరచే ప్రయత్నం జరగటంవల్ల తరువాత వచ్చిన సోషలిస్టు ఉద్యమం పని తేలికయింది.

ఆంధ్రదేశంలో చౌదరిగారు నిహిలిస్టులు. దేవుడు లేడనీ, మతం కుత్తుకలు కోసుకోటానికే వుపయోగ పడుతుందనీ చెప్పి, హేతువాదాన్ని ప్రచారం చేసిపెట్టి, సోషలిస్టు ఉద్యమానికి పునాది వేశారు.

చౌదరిగారు, కవిత్వంలో సంస్కృత పదాలకంటే, జాతీయ పదాలనే యెక్కువగా వాడాలని ప్రచారం చేస్తున్నారు. ఇలాంటి ఉద్యమమే వొకప్పుడు 'ప్యూరిస్టు మూవ్మెంట్' అనే పేరుతో ఇంగ్లండులో పుట్టింది. అప్పుడు ఇంగ్లీషుభాష, లేటిన్ భాష 'యిన్ఫ్లుయన్స్'లో వుండడం వల్ల, కొందరు యింగ్లీషు భాషలోనించి లేటిన్ పదాలు ఏరివెయ్యాలనే పట్టుదలతో యీ వుద్యమాన్ని లేవదీశారు. లేటిన్ భాషమీద ఏహ్యాభావం కలగటానికి ఒక కారణం యిది. మతకర్తలు, లేటిన్ భాషలో దేవుడు దేవరహస్యాలు వ్రాసిపెట్టాడనీ, లేటిన్లో వ్రాసిన గ్రంథాలలో దేవుడు తమకు స్వర్గద్వారపు తాళపు చెవులను యిచ్చి వెళ్ళాడనీ, దేవునిచే నిర్దేశింపబడిన తాముతప్ప యితరులు ఆ గ్రంథా

లను చదవగూడదనీ చెప్పి కొన్నాళ్లు ప్రజాసామాన్యాన్ని
మోసం చేశారు. కాని మోసం యెన్నాళ్లు దాగుతుంది?
ప్రజలెదురు తిరిగి, 'మేం చదవగూడని భాష మాకెందుకు?
మమ్మల్ని దాస్యంలో వుంచటానికి వుపయోగింపబడిన భాష
మాకెందుకు? ప్రజాసామాన్యానికి అందుబాటులో లేని
యీ భాష మాకెందుకు? మాకేం భాష లేదా? మా భాషలో
మేం వ్రాసుకోలేమా? మా భాషలో మేం చదువుకోలేమా?
మా భాషలోనే వ్రాస్తాం; సూటిగా హృదయానికి గుచ్చు
కొనేటట్టు వ్రాస్తాం! శరీరం పులకరించేటట్టు వ్రాస్తాం!
శౌర్యాగ్ని ప్రజ్వరిల్లేటట్టు వ్రాస్తాం. అసలు వ్రాయటానికి
మా భాషే తగింది' అని పట్టుపట్టారు.

చౌదరిగారి ప్రకృతికూడా యీ విధంగానే నిష్ట
క్టయిందని నా విశ్వాసం. అగ్రజాతి, 'సంస్కృతం దేవ
భాషా, అది శూద్రులు చదవగూడదూ' అని శాసించటం
వల్ల 'అసలు పరభాష మాకెందుకూ? ప్రజల హృదయాల్లో
నించి వచ్చిన సజీవమైన మా భాషే మేం వ్రాసుకుంటాం'
అనే పట్టుదలతో యీ వుద్యమాన్ని లేవనెత్తారు.

విప్లవం ప్రజలతో పని. ప్రజల భావాలు మారందే
విప్లవం రాదు. అందుకనే ప్రతి విప్లవకారుడూ ప్రజలకు అర్థ
మయ్యే భాషలో తన భావాలను చెప్పుకోవటం ముఖ్యావ
సరం. అందుకనే బుద్ధుడు సంస్కృతంలో గ్రంథాలు వ్రాయ
టం మానివేసి పాళీభాషలో వ్రాయించాడు. అందుకనే చౌద
రిగారు 'దేశ కవిత్వం మారాలి' అంటారు, జాతీయాలు వుప

ధనవంతులూ, రాజులూ, ప్రోత్సాహమిచ్చి రత్నాంబరాలిచ్చి, అడిగించుకోకుండా అగ్రహారాలిచ్చి, దినవెచ్చం పంపించి వ్రాయించిన రచనల్ని మనం చూశాం. అందులో స్వాతంత్ర్య లక్షణాలున్నాయా? వారికి తెలియకుండానే, ధన సహాయం చేసిన రాజుల రుచుల కనుకూలంగా వారిని మెప్పించటానికి రాయలేదా? కనుక ఒకవ్యక్తి ప్రోత్సాహం వల్లగానీ, రాజుల ప్రోత్సాహంవల్లగానీ వొచ్చే రచనలవల్ల ప్రయోజనం లేదు. 'రప్పించి మెప్పుమై రత్నాంబరము లిచ్చు నొసపరి దొరమైన మెసగవలయు' అని కోరనక్కరలేదు. ప్రజలే అందుకు పూనుకోవాలి. తమకు కావలసిన సారస్వతం తామే నిర్ణయించుకోవాలి. వాటి మంచి చెడ్డలను తామే విమర్శించుకోవాలి. అప్పుడుగాని ప్రజలకు వుపయోగకరమైన సారస్వతం రాదు.

చౌదరిగారు ధన్యులు. వారు వేసిన బాటనే పోతూ, వారికంటే ముందుకు సాగిపోదలచిన మనం అదృష్టవంతులం.

—o—

# ముత్యాలు

"ఎందుకు ఏడుస్తున్నావు? వివాహం చేసుకో లేకపోతున్నావా? స్త్రీవైనా బాగుండిపోయేది? నీ అశ్రుబిందువులు నీ పాదాల దగ్గర వున్న నామీద పడి నన్ను తడిముద్ద చెయ్యకుండా, ఎక్కడో ఎక్కడో పడి చిందిపోయేవి! నీ వెవరవు?" అని అడిగింది పిచ్చుక.

"నేను... బ్రతికివున్న రోజుల్లో... రాజాధిరాజును... మహారాజును" అని ఎక్కెక్కి ఏడ్వటం మొదలుపెట్టింది శిలావిగ్రహం.

"బ్రతికివున్న రోజుల్లో మహారాజులందరూ, మ[illegible] చింతరువాత యిట్లా ఏడుస్తూ కూచుంటారా? యుద్ధంలో మరణించిన రాజులకు వీరస్వర్గం! మహారాజుగా మ[illegible] వారికి ఘోర [illegible]ఖం!! [illegible]తేనా?" [illegible] [illegible] పిచ్చుక ఆశ్చర్యంతో.

"అవును!" కన్నీరు తుడుచుకుంటూ చె[illegible] విగ్రహం. మహారాజులంటే ఏమనుకున్నావు? [illegible] కాలంగడిపే అసూర్యంపశ్యలు...... [illegible] ఉద్యానవనంలో [illegible]. సాయంకాలం [illegible] రాంద్రికలో వనవిహారా[illegible]. [illegible] [illegible] [illegible], నృత్యవిశేషాలూ... జీవితమం[illegible] [illegible] గడిపాను. విషయవాంఛలలో చిక్కి [illegible] [illegible] రాజ్యాంగంలో ఏ [illegible] [illegible] [illegible] [illegible]

వల్ల ప్రజలు నన్ను కన్న తండ్రిలా చూచుకునేవారు. దుర్బలులను పొగడటం, శక్తిమంతులను సహించలేకపోవటం వాళ్ళ స్వభావం. అందుకనే నేను మరణించిన తరువాత నా ప్రాణాలను ఈ శిలావిగ్రహంలోకి ఊది, నన్నీ ఉన్నత స్థానాన ప్రతిష్ఠించారు. ప్రపంచమును నిజస్థితిలో నేనిప్పుడు చూడగల్గుతున్నాను. అది అసహ్యమయం! ప్రజల కన్నీ కష్టాలే!! వాటిని చూచినకొద్దీ, పిచ్చుకా, నా హృదయం ఇనుముతో చేయబడ్డా తరుక్కుపోతోంది.

"నీ వేమి చూడగల్గుతున్నావు?" అని ప్రశ్నించిందా పిచ్చుక ఎగిరి ఆ శిలావిగ్రహం భుజంమీద వాలి, కూచొని.

"అదిగో దూరంగా ఆ వీధిలో ఒక పూరిల్లున్నది. అందులో ఒక యువకుడు శుష్కావయవాలతో, జీర్ణాంబరాలతో ప్రొద్దు పుచ్చుతున్నాడు. అతడు కవి, విమర్శకుడు, నటకుడు. అతడు కళకోసం ధనమును ఆర్జించుకొని సుఖపడే అనాశాలను తన్నివేసి, దేశంకోసం ఆ పద్ధతులు పనికిరావని నిరసించి, తనకలమునే నమ్ముకున్నాడు. కాని ఈ దరిద్ర దేశం దుష్టులను తన అంకంలో చేర్చుకుంటుంది గాని, మేధావులను అర్థంచేసుకోకపోగా, సహించలేదు కూడాను. తినుటకు తిండి లేక అతని తేజోవంతములయిన నేత్రములు కుంచుకొనిపోతున్నాయి. అతని విశాలమయిన ఫాలభాగము అప్పుడే ముడుతలు పడిపోయింది... నేడతడు ఉదరపోషణార్థం ఒక పుస్తకం వ్రాస్తున్నాడు కాని దానిని పూర్తిచేయుటకు అతనిలో జవసత్వాలు లేవు... దీపములో చమురు లేదు...

చేతిలో చిల్లి గవ్వయినా లేదు... చేయునది లేక అతడు నిరాశాపూరితుడై తలను చేతులలో ఇరికించుకొని విలపిస్తు న్నాడు. పిచ్చుకా! నా హృదయం నీరైపోతోంది. కాని నేను కదలలేను. నా కత్తిలోని ఈ ముత్యమును తీసుకొని పోయి అతనికివ్వు—పుణ్యముంటుంది."

"వారం రోజుల క్రితమే నా మిత్రులందరూ ఈజిప్టు దేశం వెళ్ళారు. వాళ్లు నాకోసం కన్నులు బండిచక్రాలంత చేసుకొని ఎదురు చూస్తూ వుంటారు. నైలు నదిలో ఈదు లాడి, పుష్పాడిలో దొర్లి దొర్లి, తామరపూలతో సరసా లాడుతూ సుఖంగా కాలం గడుపుతూ ఉంటారు. నే నక్క- డికి పోవాలి... వెంటనే పోవాలి" అన్నది పిచ్చుక.

"పిచ్చుకా, పిచ్చుకా!! నేను చెప్పినట్లు చెయ్యి. అతడు క్షుద్బాధను ఓర్చుకోలేక మూర్ఛపోయాడు."

"సరే, నేటికి నా ప్రయాణం ఆగిపోయింది. ఈరాత్రి నీతో వుండి నీవు చెప్పినట్లు చేస్తాను."

శిలావిగ్రహం సంతోషించింది... చల్లని చూపులతో తన కృతజ్ఞతను వెల్లడించింది.

పిచ్చుక ఆ ముత్యమును ముక్కుతో కరచుకొని పోయింది. ప్రేమికీ ప్రేమికులు తొంగిచూశారు. ఈ బాహ్య ప్రపంచాన్నే మరచిపోయిన స్వార్థపరులువారు. వారిద్దరి ప్రేమ మధ్య ఎందరు జీవులు హతమౌతున్నారో ఆలో చించుకోరు. సుఖం కొరకు ప్రేమిస్తారు; ఆసుఖమును పొందు టకు ఎట్టి కష్టములనయినా ఓర్చుకొంటారు; ఎందరినయినా

నాశనం చేస్తారు. ధనార్జనాపరులూ ఇంతే. కాని 'నాదిది పవిత్ర ప్రేమ, వీరిది స్వార్థం' అంటుంది ప్రపంచం.

పిచ్చుక వీటివంకయినా చూడకుండా పోయింది. పగలు సంపాదించుకున్న ధనమును భేదాభిప్రాయాలుపడి, భాగించుకోలేక పోట్లాడుకునే వర్తకులను తొంగిచూచి పోయింది. రాజసౌధాలను దాటిపోయింది. దేవాలయాలమీదుగా ఎగిరిపోయింది. చివరకి ఆ కవి గృహం ప్రవేశించింది. సొమ్మసిలి పడివున్న అతని ప్రక్కనే ముత్యము నుంచి, నెమ్మదిగా తనరెక్కలతో అతనికి విసిరి ఎగిరిపోయింది.

అతడు సేదదేరి ఆ ముత్యమునుచూచి, "జ్ఞానసూర్యుడుదయిస్తున్నాడు. అప్పటికప్పుడే అతని కిరణములు తమ పనిని నిర్వర్తిస్తున్నాయి. ఇంక ఈ అంధకారం ఎంతసేపో ఉండను. "ఆహా !" అని సంతోషించి, ద్విగుణీకృతోత్సాహంతో పుస్తకమును పూర్తిజేయ పూనుకున్నాడు.

## 2

మరుదినమా పిచ్చుక ఊరుపట్టుకొని తిరిగింది. కనుపించిన ప్రతినదిలోనూ స్నానం చేసింది. చింతచెట్టు చిటారుకొమ్మన కూర్చొని తనలో తాను తలతో లయవేస్తూ పాడుకుంది. చూచినవాళ్ళందరూ "భలేపిచ్చుక !" అన్నారు...

చంద్రోదయం కాగానే శిలావిగ్రహం దగ్గరకువచ్చి, "నే నిప్పుడు ఈజిప్టు పోతున్నాను. ఏమయినా కబుర్లున్నాయా ?" అని అడిగింది.

"పిచ్చుకా ఈ రాత్రికూడా ఉండు" అని ప్రార్థించిందా. విగ్రహం.

"వీల్లేదు."

"అదుగో ఆ ఇంట్లో ఒక స్త్రీ నిద్రాహారాలు లేకుండా విలపిస్తోంది. 'కొడుకా !' అని అన్న ఆమె నోటికి మూాత పడలేదు. ఆమె ఏకైకపుత్రుడు సోషలిస్టు అగుటవల్ల ప్రభుత్వమునకూ, ప్రజలకూ పనికిరాకుండా పోయాడు. ప్రభుత్వము అతని చర్యలు ఉపద్రవము లైనవని భయపడి అతనికి కఠిన శిక్ష విధించింది. ప్రజలు అతని సిద్ధాంతములు అపాయకరములని నిరసించి అతనిని పైకి రానీయకుండా అణగద్రొక్కారు. తన శరీరమును మాతృదేవికి అర్పించి, తన ప్రాణములను అరచేతిలో పెట్టుకొని దేశము కొరకు పాటుపడి ఆ వీరుడు నేడు క్షయవ్యాధితో బాధపడుతున్నాడు. మరి ఈ ప్రజలు అప్పటికప్పుడే అతనిని మరచిపోతున్నారు. "చేతులారా చేసుకొన్నదానికి అనుభవిస్తున్నాడు" అని చెప్పే వేదాంతులు కూడా బయలుదేరుతున్నారు. అతడు చేసిన త్యాగమునకు, దేశసేవకు అతని మాతృదేవిని పోషించు బాధ్యతను వహించు బుద్ధిమంతులీ దేశంలో లేరు. ఆమె తినుటకు తిండి లేక, కట్టుటకు గుడ్డలేక కన్నపుత్రుని తలచుకొని రోదిస్తోంది.

"నే నీ రాత్రి నీతో వుండి నీవు చెప్పినపని చేస్తాను. కాని ఇక నీ దగ్గర ముత్యాలు లేవే ! ముత్యాలు లేనివాడు యితరుల కష్టములను చూచి మనోవ్యధపాలయి యేమి ప్రయోజనం ?"

"పిచ్చుకా ! నా నేత్రాలను ముత్యాలతో చేశారు ఘాగులు. అందులో ఒకదానిని తీసికొనిపోయి ఆమెకివ్వు.

"ఎంతమాట! ఎంతఘోరం !! అంతపని నేను చెయ్యలేను. ఎన్నటికీ చెయ్యను" అన్నదా పిచ్చుక కంటతడి పెట్టుకొని.

"పిచ్చుకా, పిచ్చుకా, నేను చెప్పినట్లు చెయ్యి."

పిచ్చుక మాట్లాడకుండా ఆవిగ్రహం కన్నుముక్కుతో పీకి, తీసుకొనిపోయి ఆమెకు ఇచ్చివచ్చింది. "నా కుమారుని స్వార్థత్యాగమునకు మెచ్చి ఎవ్వరో పంపార"ని అనుకున్నదామె.

# 3

మరుదినమంతా పిచ్చుక పరధ్యానంగా తిరిగింది ... ఆందోళన పడ్డది. చీకటిపడగానే శిలావిగ్రహం దగ్గరకువచ్చి, "నీదగ్గరశలవు తీసుకొనుటకు వచ్చా"నని చెప్పింది.

"పిచ్చుకా, పిచ్చుకా, నాతో ఈ రాత్రికూడా ఉండవా ?" అని కోరింది శిలావిగ్రహం.

"వీల్లేదు."

"అక్కడ ఒకయువతి కుమిలికుమిలి ఏడుస్తోంది. మన సార బిగ్గరగా దుఃఖించే భాగ్యమునకుకూడా ఆమె నోచుకో లేదు. అకారణంగా ఆమెను భర్త వదలివేశాడు. అతడు ఇంకొకతెను వివాహమాడి కులుకుతున్నాడు. కాని సంఘం ఈమెను గుప్పెటలో ఇరికించుకొని పుణ్యం, స్వర్గం అనే ఆశలు గలిగించి నలిపినలిపి బాధపెడుతోంది. ఆ సుకుమార

హృదయం బాధకు తాళలేక అల్లడితల్లడై పోతోంది. భరిం
చవలసినవాడే వదిలివేయటంవల్ల కిన్నవారుకూడా ఆమెను
నీచంగా చూస్తున్నారు. భావకవులు ఆమెమీద పద్యాలు
వ్రాసి పేరు గడించుకుంటున్నారు. వారు భావకవులు కాదు
—స్వార్థపరులు. వారిలో ఎవ్వరూ ఆమెను కాపాడుటకు
ప్రయత్నించరు. ఆమె అపూర్వసౌందర్యం అరణ్యంలోని
సుమమువలె, సముద్రంలోని ముత్యంవలె, ఊరికే పోతోంది.
పిచ్చుకా! నే నిది భరించలేను. నా రెండో కన్ను తీసుకొని
పోయి ఆమెకివ్వు. ఆ ధనంతో ఎక్కడకయినా లేచిపోయి
సుఖపడుతుం దామె!"

"నేను చచ్చినా ఈపనిచేయను. నీవు అంధుడవౌ
తావు."

"పిచ్చుకా! పిచ్చుకా!! నేను చెప్పినట్లు చెయ్యి.
అంధులే ధర్మాలుచేసేది! ఈ లోకమును ఒంటికంటితో
తిలకించలేను."

ఆ పిచ్చుక అతని రెండో కంటిని ఆమెకిచ్చి వచ్చింది.

4

"ఇపుడు నీ వంధుడవు. నేను నిన్ను ఈ స్థితిలో
వదలిపోలేను. కనుక యిక్కడనే కాలక్షేపం చేస్తాను. నీకు
కాలము గడచుటకు వినసొంపయిన కథలు చెబుతాను."

"పిచ్చుకా, నాకు కథలు ఒద్దు. నా రాజ్యమంతా
చూచి అందలి ప్రజ లనుభవించే కష్టములను నాకు విని
పించు. ఈ ప్రపంచంలో కష్టసుఖాలకన్నా వేరు కథలు లేవు."

ఆ పిచ్చుక పగలంతా ఊరూరూ తిరిగి తాను చూచిన విశేషములను రాత్రులు ఆ విగ్రహానికి చెప్పేది. కష్టంలో వున్నవారికి ఆ విగ్రహము తన శరీరంమీది బంగారమును ఒలిచి పిచ్చుకద్వారా పంపేది. కాని కొన్నాళ్ళకు ఆ విగ్రహం యొక్క బంగారు తొడుగు అయిపోయింది. మంచులో వుండలేకా, తిండిలేకా పిచ్చుక మరణావస్థకు వచ్చింది. ఒకరోజు విగ్రహంతో "రాజా, నేను పోతున్నాను!" అన్నది.

"మంచిది పిచ్చుకా, ఈజిప్టు వెళ్లు. నిన్ను నేను చాలా రోజులు ఆపాను. నా బంగారంతోపాటు నేనీ లోకంలో చేయగలిగే పనీ అయిపోయింది. పిచ్చుకా! ఈజిప్టు వెళ్ళి నీ మిత్రులతో హాయిగా కాలం గడుపు!"

"ఈజిప్టేమి కర్మ! నేను పరలోకమునకే పోతున్నాను. కాని నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. వెళ్ళబోయేముందు ఒక్కసారి ముద్దుపెట్టుకోనివ్వు" అన్నది పిచ్చుక.

"పిచ్చుకా, పెదిమలమీద ముద్దుపెట్టుకో!" అన్నాడు రాజు.

అలాగే ముద్దుపెట్టుకొని, ప్రాణములు వదలి, విగ్రహం పాదాలమీద పడింది పిచ్చుక. ఆ శిలావిగ్రహంలో ఏదో రెండుగా పగిలిన ధ్వని.....దాని హృదయం బ్రద్దలయింది.

[ఆస్కార్ వైల్డ్ ఈ కథకు కర్త పెట్టాడు.]